

సుబ్బారావు పాణిగ్రాహి
సంధించిన కళలతోవ...

# సృజన

డిసెంబర్ 1981
122

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20
ఈ సంచిక రు. 2

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

# ఆదిలాబాద్ గిరిజన సహాయనిధి

C/o సృజన, హనుమకొండ, వరంగల్ - 506 001

గత సంచికలో ప్రకటించిన వివరాలు.

| | |
|---|---|
| ఒక బంగారు ఉంగరం, 4 వెండిమట్టెలు, 1500 రూపాయల మందులు | + 16482.03 |
| కరీంనగర్ జిల్లా పౌరహక్కుల సంఘం వసూళ్ళు | 730.00 |
| తెనాలి ఆర్ ఎస్ యు, ఆర్ వై ఎల్ వసూళ్ళు | 250.00 |
| బట్టుపల్లి హమాలీల నుండి | 200.00 |
| వీలేశ్వరం ఆర్ వై ఎల్, రైతుకూలి సంఘం బహిరంగసభలో వసూళ్ళు | 118.00 |
| వివేకానంద జూనియర్ కాలేజీ, వరంగల్ విద్యార్థులు, ఉపాధ్యాయులు | 96.00 |
| పటంచెరువు కార్మికులు | 70.00 |
| వడ్డెపల్లి ఆర్ వై ఎల్ వసూళ్ళు | 60.00 |
| మొత్తం | 18006.03 |

+ ఒక బంగారు ఉంగరం, 4 వెండిమట్టెలు, 1500 రూపాయల మందులు.

---

ఆదిలాబాద్ గిరిజన సహాయనిధి స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, వరంగల్‌లో పి. వరవరరావు పేర ఉంది. అకౌంట్ నంబర్ 2730

---

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

122 మాసపత్రిక డిసెంబర్ 1981



సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

# ప్రళయ గాయకునికి

చార్వాక

గుమ్మెటలెందరు వాయించలేదు ?
గుమ్మెట మోతలనే సమ్మెటపోట్లల్లా
నీలా నిజంగా
నీ నా విరోధులమీదికి దించినవాళ్ళేరీ ?

ఉత్తుత్తి వాగ్దానాల తొత్తులకై వారాలు
గుత్తకుగొన్న వృత్తిభిక్షుకుల ఆలాపనలను
నీలా విస్ఫూర్ణగా
ప్రేలాపనలనిషించిన మహనీయుడేడీ ?

దేశభక్తితో దైవభక్తినీ దేహరక్తినీ రంగరించి
కంకణాలతో కండువాలతో బాకాలకాకాల హుషారేగాని
నీలా నిండుమనస్సుతో
గుండెల మంటలనూ కన్నీళ్ళ సెగలనూ
గానంచేసిన వాళ్ళేరీ ?

కలంపట్టినవాడో హలంపట్టినం నాడో కాకుండా
ఖామందు రాబందులో పాలక పాతకులో కాకుండా
నీలా నిబ్బరంగా
ప్రజలను ఉద్బోధిస్తూ ప్రభంజన రేపినవాడేడీ ?

కలాన్నీ కత్తినీ పట్టి రెంటి నుంచీ అగ్నివిరాబట్టి
చావులేని బాటలో చావెరుగని పాటతో
నీలా నిజాయితీగా
నడిచి గడిచి పోగలిగిన ధీరులుంటే, ఏరీ ?

(విరసం తొలి ప్రచురణ 'ఝంఝ' సౌజన్యంతో)

## 'వధ్యశిల రజతోత్సవమ్మట..'

వధ్యశిల రజతోత్సవమ్మట
బందిఖానలు ప్రజలసొమ్మట
న్యాయమేవర్ధిల్లుతుందట
నాయకుల ఆరాధనాలట — చెరబండరాజు

ఇరవైఅయిదురోజులు వరుసగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగురాష్ట్రం ఏర్పడిన ఇరవైఅయిదేళ్ళ పండుగజరిపింది. ఎంతోమంది కళాకారులను, విద్వాంసులను సన్మానించింది. అరవైనాలుగుకళల్లో అరవైనలుగురు ఆస్థానవిద్వాంసులను నియమించి అంజయ్యగారు భోజరాజును, కృష్ణదేవరాయలను మించిపోయాడు. (చోరకళలో ఆయారాష్ట్రాల్లో అంతులేమొదలుకొని అంజయ్యదాకా ఇందిరా ఆస్థాన కేంద్ర విద్వాంసులుగనుక ప్రత్యేక నియామకాల అవసరం లేకపోయింది) పోతన మొదలుకొని పండిత రాయలవరకు పుట్టినసంవత్సరాలు, స్థలాలు పరిశోధించి సభలు, స్మారకాలు జరుపగలమని భాట్టం శ్రీరామ్మూర్తిగారు పట్టుదలగా అభిభాషిస్తున్నారు. నన్నయనుంచి వీరేశలింగందాకా రాజమహేంద్రివరం ప్రశస్తి ఈ సందర్భంలో ప్రశంసకు వస్తూనేవున్నది. మద్రాసులోకూడా ఇతరులకోసమైనాసరే తెలుగువాళ్ళు ఇంకొకభాషలో మాట్లాడడం సహించనంటున్నాడు అధికారభాషా అధ్యక్షుడు.

ప్రపంచంలో ఇంతవరకూ ఏ కవికీ, కావ్యానికీ జరగని అపూర్వమైనగౌరవం విదేశాంధ్ర ప్రచురణలు, లండన్‌వారు శ్రీశ్రీకి, మహాప్రస్థానానికి కలిగించారు. ఆయన కలాన్నీ గళాన్నీ లిపిలో స్వరంలో శాశ్వతీకరించారు.

తెలుగుభాషా సాహిత్య సంస్కృతులకు నిజంగానే పెండిపండుగ జరుగుతున్నదా అని అనిపించే తరుణంలోనే మద్రాసులో శ్రీశ్రీ ఇల్లు వేలంవేయబడుతున్నది శ్రీశ్రీకి గొంతుక్యాన్సర్ అని డాక్టర్లు నిర్ధారణచేసారు. అప్పుతీర్చి ఇల్లుకాపాడుకోడానికైనా, ఇంకాఎదిగిరాని పిల్లలకు పెద్దచదువులు చెప్పించడానికైనా మహాకవికి శక్తిలేదు. 'రాచపుండు' చికిత్స చేయించుకోవడానికి శ్రీశ్రీ వి ఐ పి కాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రథమ ప్రపంచ తెలుగుసభల్లో లాఠీచార్జ్‌చేసి, లాకప్పులోపెట్టి ఆయనను సన్మానించింది. తెలుగు సినిమారంగం 'ఆకలిరాజ్యం'లో 'మరోప్రపంచాన్ని' ఎట్లా డబ్బుచేసుకోవచ్చునో చేసుకొనిచూపింది. తెలుగు సాహిత్యరంగం ఎన్ని సభలకు, సన్మానాలకు, ఉపన్యాసాలకు, పదవులకూ కూడ ఒడవని ముడిసరుకును శ్రీశ్రీగనిలో కనిపెట్టింది. తెలుగు ప్రచురణారంగం 'మహాప్రస్థానం'మీద దృశ్యాల్లోనూ, శ్రీశ్రీ రూపంలోనూ ఏమార్పులేకుండానే ఎన్నెన్నో కూర్పులుగా బలిసి

పోయింది. ఉన్నదంతా తాగి పాడుచేసుకున్నాడని తాగుతూకూడ పాడుకానివాళ్ళంతా శ్రీశ్రీని నిందిస్తున్నారు. ప్రభుత్వాన్ని, సినీపరిశ్రమను పద్ధతిపట్టక, కాకాపట్టక పాడయ్యాడన్నదే వీళ్ళకాయనమీదున్న అక్కసు. మరి జీవితంలో ఏ అరాచకత్వం లేకుండా, ప్రజలగొడవ తనగొడవగా పాడుతున్న కాళోజీ తనజబ్బులకు మందులు కొనుక్కోలేనిస్థితిలో బాధపడుతున్నాడంటే ఎవరిని నిందించాలి?

ఒక కవికి క్యాబినెట్ హోదా కల్పించిన ఈ ప్రభుత్వమే చావుబతుకుల్లోవున్న మరొక కవికి రాష్ట్రంలోకల్లా ఉన్నతమైన న్యాయస్థానం చెప్పినప్పటికీ ఆయన జీతపురాశ్ళుకూడ ఇవ్వడం లేదు. ఒక దశాబ్దంపైగా ఈ ప్రభుత్వం ఆ ప్రజాకవిని దాడి, నిషేధం, జైలు, జబ్బు రూపాల్లో వెన్నాడుతున్నది. ప్రజల గురించి పాడి, మాట్లాడి, పోరాడిన చెరబండరాజు మేధస్సుకు కోసేసినాతొలగని పుండయి చుట్టుకున్నది ఈ వ్యవస్థ నిర్బంధం. రోజూ ఏదో ఒక సాహిత్య సాంస్కృతిక కళా వినోదాలు ప్రదర్శింపబడే రవీంద్ర భారతికి కూతపెట్టు దూరంలో 'గాంధీ రోగ నిలయం'లో ఈ వ్యవస్థతో పోరాడుతున్నంత తీవ్రంగా ఆయన మృత్యువుతో పోరాడుతున్నాడు. ఆయన ఆరోగ్యం ప్రభుత్వానికి పట్టదు, ఆయన కుటుంబం, పసిపిల్లల భవిష్యత్తు ప్రభుత్వానికి పట్టదు. ఏ కవి వారసత్వాన్ని అందుకొని ఆయన కలపట్టి గళం విప్పాడో ఆ సుబ్బారావుపాణిగ్రాహిని పన్నెండు సంవత్సరాలక్రితం కాల్చి చంపిన ప్రభుత్వం ఇది. పద్నాలుగు సంవత్సరాల బంగారుబాబు చినబాబు చిరునవ్వుతో మృత్యురూపంలోవున్న ప్రభుత్వాన్ని ధిక్కరించి బలియైన గాధను 'చిరంజీవి' కథగా మలచినందుకు 'ఇప్పుడు వీస్తున్నగాలి'ని నిషేధించిన ప్రభుత్వమిది. ఇపుడు వీస్తున్న గాలిని నిషేధించి గతకాలపు ఘనకీర్తికి తద్దినాలుపెట్టే ప్రభుత్వమిది. జీవన్మరణ పోరాటాల్లోవున్న ప్రజల్ని చిత్రహింసలకు గురిచేసి శవాలకు అలంకరణచేసే వ్యవస్థ ఇది. ఈ వ్యవస్థ స్వభావాన్ని, ప్రభుత్వ స్వరూపాన్ని అర్థంచేసుకున్న ప్రజలు తమ కవులను, కళాకారులను కళ్ళల్లోపెట్టుకొని ఆదరించారు. గుండెల్లో దాచుకొని కాపాడుకున్నారు చెరబండరాజు ఆరోగ్యం విషయంలోనే నేల నాలుగు చెరగులనుంచీ వచ్చిన సహకారమే అందుకు నిదర్శనం. ప్రజాకవుల విషయంలోనే కాదు, ప్రజాకార్యకర్తల విషయంలోనేకాదు, ప్రజల విషయంలో కూడ. వీళ్ళందరినీ బలాదూర్‌చేసి, ఖాతరుచేయకుండా ప్రజాధనాన్ని భాషా సాహిత్య సంస్కృతుల పేరుమీద, జాతి పేరుమీద గతఖ్యాతి పేరుమీద తోడుదొంగలై దోచుకుంటున్న వాళ్ళ బొడ్లోవేలేసి నిలదీసి అడిగేతరుణం వచ్చిందని ఈ రజతోత్సవాలు మనను మరోమారు హెచ్చరిస్తున్నాయి.

— సంపాదకుడు

11-12-81

చర్చ :

## రగులుకొనే రాక్షసిబొగ్గు

నావాదానికి పునాదిగా పృథ్వీ [1] పేర్కొన్న పది అంశాలూ నిజంగా నావాదానికి పునాదేనాఅన్న శుష్కతర్కానికి దిగకుండా, సీరియస్‌గా రాసిన వ్యాసానికి సీరియస్‌గానే సమాధానం చెప్పినందుకు అతనికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ, మూడు ముఖ్యమయిన విషయాలను మాత్రం చర్చిస్తాను. ఈ చర్చలోనే మిగిలినవిషయాలకు సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తాను. దేనికయినా సమాధానం తగలకపోతే అది పునరుక్తి అవుతుందన్న భయంవల్లనే. ఉదాహరణకి, మార్క్సిస్టు దృక్పథంలో జాతిఉద్యమాలకు విశిష్టస్థానం లేదనడంలోగల ఉద్దేశ్యం ఏమిటో ఆ ప్రశ్నకే స్పష్టంచేసాను : "అన్ని జాతిఉద్యమాలూ సమర్థనీయంకావు, అన్నీ వ్యతిరేకించవలసినవీకావు". శ్రామికపోరాటం మార్క్సిస్టు దృక్పథంలో ఎప్పుడూ సమర్థనీయమే; దాని ఎత్తుగడలోగాని- ఆమాటకొస్తే వ్యూహంలోగాని- పొరబాట్లున్నా దాన్ని మార్క్సిస్టులు వ్యతిరేకించరు. మిత్రభావంతో విమర్శిస్తారు. ప్యారిస్‌కమ్యూన్‌పట్ల మార్క్స్ అవలంభించిన వైఖరి దీనికొక ఉదాహరణ. ఈ విశిష్టస్థానం మరేఇతర ఉద్యమాలకూలేదు. ఇతర ఉద్యమాలను, వాటి వర్గస్వభావాన్నిబట్టి, సమర్థించడం లేక మిత్రభావంతో విమర్శించడం, లేక వ్యతిరేకించడం జరుగుతుంది. నావుద్దేశ్యం యింతమాత్రమే. ఈ అవగాహనే సురా పుస్తకంలో లోపించింది. "అవి జాతిఉద్యమాలు కాబట్టి సమర్థించాలి" అని సురా ఎక్కడా అనకపోయినా ఆ అభిప్రాయం పుస్తకంలో అడుగడునా కనిపిస్తుంది. అందుకే ప్రత్యేకించి జాతిఉద్యమాలకు మార్క్సిజంలో విశిష్టస్థానంలేదని గుర్తుచేయవలసి వచ్చింది.

1. <u>అంతర్గత వలసలు :</u> మొదట ఒకవివరణ. అంతర్గతవలసను colonial hinterland అనడంతప్పు. ఆతప్పుచేసింది నేనేఅయినా పృథ్వీగాని మరెవ్వరుగాని ఎత్తిచూపకపోవడం విచారకరం- colonial hinterland అంటే పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన ప్రాంతానికి పారిశ్రామిక ముడిసరుకులను సరఫరాచేసే వెనుకబడ్డ ప్రాంతం. ఇది దేశంలోపలేకాదు, వెలుపలగూడా ఉండవచ్చు. అంతర్గతవలసను internal colony అనాలి. రెండవది, colonial hinterland అనేభావన- నా దృష్టిలో- మార్క్సిజానికి చెందదు- ఎందుకంటే ముడిసరుకులను సరఫరా చేయడమే వలస సంబంధంగా మార్క్సిజం పరిగణించడానికి వీలులేదు. ముడిసరుకులు-పారిశ్రామిక ఉత్పత్తులు అనే ప్రాథమిక ప్రాదేశిక శ్రమవిభజన, పెట్టుబడీదారీ అసమాన అభివృద్ధిలో ముఖ్యమయినఅంశం. అది వలససంబంధాన్ని సూచించదు- అయితే

అప్ఘాంగురించి EPWలో, Frontierలో, జరిగిన చర్చలోను, సురా పుస్తకంలో గూడ, ఈ అవగాహనేవుంది. అసలు వలసఅంటే ఏమిటో ముందు కొంచెంచర్చిస్తే బాగుంటుంది.

ఒకప్రాంతం ఆర్థికరంగంలోకి వేరొకప్రాంతానికి చెందిన పెట్టుబడిదార్లు ప్రవేశించిఅక్కడ సమీకరించిన పెట్టుబడిని తమప్రాంతానికి తరలించుకుపోవడం వలస సంబంధానికి చాల కీలకమయినఅంశం. ఇక్కడ తరలించబడేది పెట్టుబడి, సంపదకాదు. గోరీ మహమ్మదు, గజనీ మహమ్మదు, నాదిర్‌షా, మనదేశంనుండి తీసుకుపోయింది రాశిలో ఎంత పెద్దమొత్తమయినా కావచ్చుగాని, గుణంరీత్యా అదిఇక్కడ పెట్టుబడిగా ఉపయోగపడగల సంపదాకాదు, అక్కడ (అఫ్ఘానిస్తాన్‌లో, పర్షియాలో) పెట్టుబడిగా ఉపయోగించబడ్డదీకాదు. గుళ్ళలో నిరర్థకంగా మగ్గిపోతున్న ఆభరణాలను వాళ్ళు అంతకంటే నిరర్థకమయిన విలాసాలమీద వెచ్చించడానికి తీసుకుపోయారు. దానివల్ల మనదేశానికి వచ్చిందీలేదు, పోయిందీలేదు.

పెట్టుబడిదారీ వికాసానికి అవశ్యంగా అనుబంధమయిన వలసవిధానంలో తరలించబడేది కేవలం సంపదకాదు, పెట్టుబడి. అందుకే వలసల ఆర్థికవ్యవస్థ వక్రీకృతం (distart) అవుతుంది. దోచుకునే దేశానికిచెందిన పెట్టుబడిదార్లు మొదటవలసకు పెట్టుబడి ఎగుమతిచేస్తారు, ఆ తరువాత అంతకంటే ఎక్కువమొత్తం దిగుమతి చేసుకుంటారు- లాభాలరూపంలో గతంలోని వలసవిధానంలోను ఇవ్వాల్టి నయా వలస విధానంలోను ఈ పెట్టుబడి తరలింపు విస్తృతంగా కనబడుతుంది. బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవానికిపూర్వం ఒక శతాబ్దంపాటు జరిగిన పెట్టుబడి ప్రాథమిక సమీకరణ (primitive accumulation)లో సమీకరించబడ్డ పెట్టుబడిలో 30 శాతం వలసల నుండి భూమిశిస్తు రూపంలోను వాణిజ్యలాభాల రూపంలోను దోచుకోబడ్డదేనని ఒక అంచనాఉంది.[2] ఆకాలంలో సమీకరించబడ్డ పెట్టుబడి పారిశ్రామిక విప్లవాన్ని సాధించడంలో ఎంతముఖ్యమయినపాత్ర నిర్వహించిందో గుర్తుంచుకుంటే, ఈ 30 శాతం పెట్టుబడి తరలింపు జరగకుంటే ప్రపంచచరిత్ర వేరుగావుండేదని గ్రహించవచ్చు. అలాగే, ఇవ్వాళ అమెరికాకుచెందిన గుత్తపెట్టుబడిదారీ సంస్థలు సాలీనా ఎగుమతి చేసే పెట్టుబడికీ, అవి లాభాలరూపంలోను ఇతరత్రా దిగుమతిచేసుకునేది రెండు మూడు రెట్లు ఉంటూవస్తోంది. ఉదాహరణకు 1979లో ఎగుమతిఅయిన పెట్టుబడి 50 బిలియను డాలర్లయితే తిరిగివచ్చింది 130 బిలియను డాలర్లు- అంటే అర్థ వలసలనుండి నయావలసలనుండి ఆ సంవత్సరంలో తరలించబడ్డ పెట్టుబడి 80

బిలియను డాలర్లు.[3] ఇది మనప్రభుత్వం ఒక పంచవర్ష ప్రణాళికలో ఖర్చుపెట్టే మొత్తంలో 70 శాతం.

ఈ పెట్టుబడి తరలింపు వలస సంబంధానికి కీలకమయిన విషయం (ఇదే వలస సంబంధాన్ని నిర్వచిస్తుందని నేననడం లేదు. వర్గసంబంధాలను సంపూర్ణంగా విశ్లేషించకుండ వలస సంబంధాన్ని నిరూపించలేం). పాకిస్తాన్‌లో ఇదే జరిగింది. పాకిస్తాన్‌కు విదేశీమారకం తూర్పు బెంగాల్‌లో పండే జనపనారను ఎగుమతి చేయడం ద్వారా వచ్చేది. అయితే తూర్పు బెంగాల్ రైతాంగం, వ్యాపారస్తులు, నిర్బంధంగా ఆ విదేశీమారకాన్ని 50 శాతం తక్కువ ధరకు ప్రభుత్వానికి అమ్మవలసి వచ్చేది అట్లా సేకరించిన విదేశీమారకాన్ని ప్రభుత్వం అదేధరకు (అంటే మార్కెట్ రేటు కంటె 50 శాతం తక్కువ ధరకు) పశ్చిమ పాకిస్తాన్‌కు చెందిన గుజరాతీ - పంజాబీ పెట్టుబడిదార్లకు అమ్మేది. ఈ రకంగా తూర్పు బెంగాల్‌లో సమీకరించబడే పెట్టుబడిలో గణనీయమయిన భాగం పశ్చిమపాకిస్తాన్ పెట్టుబడిదార్ల చేతిలోకి తరలివెళ్లేది.[4] ఈ పశ్చిమ పాకిస్తాన్ పెట్టుబడిదార్లు విదేశీమారకం రూపంలో తమకు ఇట్లా లభ్యమయిన పెట్టుబడిని దాదాపుగా పశ్చిమ పంజాబుకే (నిజానికి కరాచీనగరానికే) పరిమితమయిన తమ దళారీ వ్యాపారానికి వాడుకునేవారు.

అందుకే తూర్పు బెంగాల్ పశ్చిమ పాకిస్తాన్ చేత వలసరూపంలో దోచుకోబడిందన్నాను. మరిప్పుడు, పాకిస్తాన్ ఇండియాలు రెండూ అర్ధవలస సమాజాలే అయినప్పుడు ఒక దానిలో అంతర్గత వలసలుండగా రెండవ దానిలో లేకపోవడం "పరస్పర విరుద్ధం" అని జడాత్మకంగా ప్రకటిస్తే నేను సమాధానం చెప్పలేను, చెప్పనవసరం లేదు. ఇట్లా తర్కించుకుంటూపోతే శ్రీలంకలోను భూటాన్‌లోను మారిషియస్‌లోను అంతర్గత వలసలకోసం వెతకాల్సివుంటుంది.

మనదేశంలో అటువంటిదేం జరగడంలేదు. అంటే ఒక ప్రాంతంనుండి పెట్టుబడిని తరలించి వేరేప్రాంతానికి చెందిన పెట్టుబడిదార్లు ఆప్రాంతంలో సమీకరించడం అనేది ఇక్కడ జరగడంలేదు. దీనిని అర్థంచేసుకోవాలంటే మన గుత్తపెట్టుబడిదారీ వర్గం ఏర్పడ్డక్రమాన్ని కొంచెం తెలుసుకోవాలి. ఇవ్వాళ్టి మన బడాపెట్టుబడిదార్లు మధ్య యుగాలకు చెందిన వణిజుల సంతతికాదు. వీళ్ల బ్రిటిష్ వలసవాదానికి ఏజెంట్లుగాను బ్రోకర్లుగాను మొదలయి, క్రమంగా గుత్తపెట్టుబడిదార్లగా ఎదిగారు. మధ్యయుగానికి చెందిన వ్యాపారవర్గాలు మనదేశ ఫ్యూడల్ వ్యవస్థ విచ్ఛిన్నతతో పతనం కాగా ఏర్పడ్డ ఖాళీని వీళ్లు భర్తీచేసి మొత్తం దక్షిణేతర భారతదేశాన్ని - మహారాష్ట్ర

నుండి బెంగాల్ అస్సాం ఒరిస్సాల వరకు- ఆక్రమించుకున్నారు. అస్సాంలోనేకాదు, మహారాష్ట్రలోను బెంగాల్‌లోను ఒరిస్సాలోను గూడ మార్వాడీ గుజరాతీ వ్యాపారస్తులదే పైచేయి. పరిమాణంలో తేడా వుండవచ్చునేమోగాని గుణంలో లేదు. రాజకీయంగా ఉత్తరభారత దేశానికి చాలకాలం సన్నిహితమయిన తెలంగాణ, ఉత్తర కర్ణాటక వంటి దక్షిణాది ప్రాంతాలలో గూడ వీళ్లు బలంగానే వున్నారు.

ఈ మార్వాడీ- గుజరాతీ- పార్సీ వ్యాపారస్తులకు ప్రాంతీయతత్వం ఎన్నడూ లేదు. అంటే వాళ్ళకు ఇతరప్రాంతాలనుండి పెట్టుబడిని (లాభాలను) తరలించి "తమ" ప్రాంతంలో మదుపుపెట్టే దృక్పథంలేదు. బిర్లాలు బీహార్‌లోని తమ గనులలో అమానుషమయిన పద్ధతులద్వారా సమీకరించే పెట్టుబడిని సిర్‌పూర్ పేపర్‌మిల్లులో నష్టాన్ని భర్తీచేయడానికి వాడుకోవచ్చు, దేశంలో వివిధ ప్రాంతాలలోవున్న హిందుస్తాన్-లీవర్ ఫ్యాక్టరీలలో వాడుకోవచ్చు, అస్సాంలోని తోటలకు తరలించవచ్చు, లేదా- అన్నిటికంటే ఇదిపంభవం- అక్రమనిల్వలకోసం ఉపయోగించవచ్చు. వాళ్ళ "దేశం" అయిన మార్వార్ (రాజస్థాన్ పశ్చిమదిశనవున్న ఎడారిప్రాంతం)లో పరిశ్రమలు కాదుగదా మంచినీళ్ళుగూడ దొరకవు. తాతాలు జంషెడ్‌పూర్‌లో కూడబెట్టిన పెట్టుబడిని బొంబాయిలో అబ్దుల్ రెహమాన్ అంతులే నిధికి చందాగాఇవ్వవచ్చు, శ్రీనగర్‌లో five-star hotel కట్టడానికి వాడుకోవచ్చు, లేదా అల్జీరియాకో నైజీరియాకో లైబీరియాకో ఎగుమతిచేయవచ్చు (మన పెట్టుబడిదార్లకు ఇది కొత్తగా పుట్టిన సరదా). ఈ బడాపెట్టుబడిదార్ల పరిశ్రమలు ఒకప్పుడు కలకత్తాలో ఎక్కువగా వుండేవి. 1947 తరువాత వివిధ కారణాలవల్ల బొంబాయికితరలించారు. రేపు దత్తాసామంత్ విజృంభణను ప్రభుత్వం అపలేకపోతే అక్కడినుండి ఎక్కడికయినా పోవచ్చు. వీళ్ళది చాల "విశాల" దృక్పథం.

నా దృష్టిలో ఇది గుణాత్మకమయినతేడా. ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి పెట్టుబడి తరలింపు జరగకుండ, పెట్టుబడి కేవలం ఒక అఖిలభారత బడాపెట్టుబడిదారీవర్గం చేతిలో సమీకరించబడుతున్నప్పుడు "అంతర్గత వలసల" గురించి మాట్లాడడం అశాస్త్రీయం. ఇది అస్సాంకేకాదు, నాగాలాండ్‌కూ వర్తిస్తుందని ఇదివరకు అన్నాను. నాగాలాండ్‌కేకాదు, జార్ఖండ్‌కుగూడ వర్తిస్తుంది. ఛత్తీస్‌ఘర్‌కూ వర్తిస్తుంది. అంటే జార్ఖండ్ ఛత్తీస్‌ఘర్ ఉద్యమాలు సమర్థనీయంకావనికాదు. మనదేశంలో జాతులసమస్యను "అంతర్గతవలస" సిద్ధాంతదృష్ట్యా అర్థంచేసుకోవడం తప్పని. వివిధజాతులు చారిత్రికంగా వర్గీకరించబడ్డతీరు, అవి భూస్వామ్య సమాజం

లోకి ప్రవేశించిన(లేక ప్రవేశించని) తీరు, పెట్టుబడిదారీ ఆర్థికసంబంధాలు అంకురించిన తరువాత ఆ సంబంధాలు వివిధ ప్రాంతాలకు ప్రసరించిన (లేక ప్రసరించని) తీరు, పరిశీలిస్తేనే మన దేశంలో జాతుల సమస్యను అర్థంచేసుకోగలుగుతాము. ఆ ప్రయత్నం చేయడానికి ఇది సందర్భమే అయినా, నా పరిమితుల దృష్ట్యా సమయం కాదు.

## 2 అస్సాం పెట్టుబడిదారీ వర్గం

అస్సాంలో ప్రాంతీయ పెట్టుబడిదారీ వర్గం వుందనిగాని, అది ఒక బలమయిన ఉద్యమానికి నాయకత్వం వహించగలదనిగాని, అనుకోవడం ప్రయాసపూర్వకమయిన ఊహ అని నిర్మల్ సేన్‌గుప్త అన్నమాటను పృథ్వీకోట్ చేసారు. దీనికి నావి మూడు సమాధానాలు. ఒకటి, అస్సామీ భాష మాట్లాడేవారే అస్సామీ పెట్టుబడిదార్లనుకున్నా వాళ్లు తేయాకుతోటల్లోనూ వున్నారు, ఇతర రంగాలలోనూ వున్నారు. రెండు, అక్కడే స్థిరపడిపోయి ప్రాంతీయ బూర్జువా వర్గంలో భాగమయిన మార్వాడీలను గూడ కలిపితే ఈ బూర్జువా వర్గం చిన్నదేంకాదు. ఇదే సరయినదని నా అభిప్రాయం. లేకపోతే మన రాష్ట్రంలో ఖండసారీ పరిశ్రమలో బలంగావున్న మార్వాడీలు, నిజామాబాద్ బీడీ పరిశ్రమను ఆక్రమించుకున్న గుజరాతీలు ఇక్కడి ప్రాంతీయ బూర్జువా వర్గంలో భాగంకాదని, మనను దోచుకుని ఇతర ప్రాంతాలను అభివృద్ధిచేస్తున్న "విజాతీయు" లని, అనవలసివుంటుంది. అది హాస్యాస్పదం అవుతుంది. మూడు, ఈ విషయంలో గూడ మనదేశానికీ, పదహారుపదిహేడు శతాబ్దాల యూరప్‌కూ తేడా చూడాలి. యూరప్‌లో పెట్టుబడిదారీ వర్గం వాణిజ్యంలో లాభాలు సంపాదించి పెట్టుబడిసేకరించి దాన్ని ప్రాతిపదికచేసుకుని పారిశ్రామిక రంగానికి దిగింది. ఇక్కడ అంత శ్రమ పడవలసిన పనిలేదు. ఇక్కడున్న పెట్టుబడిదారీ వర్గం ఒక bureaucratic-capitalist class దీనికి పెట్టుబడితానే కూడబెట్టుకుని ఒక బలమయిన వర్గంగా రూపొందిన తరువాతే పారిశ్రామిక రంగంలోకి దిగాల్సిన పనిలేదు. కావలసిన పెట్టుబడి ప్రభుత్వము, IDBI, IFC వంటి ప్రభుత్వ ద్రవ్యసంస్థలు ఇస్తాయి- ప్రభుత్వంతో సత్సంబంధం వుంచేచాలు. సర్వసాధారణంగా "ప్రైవేటు" రంగంలో ప్రైవేటు పెట్టుబడికంటె "పబ్లిక్" పెట్టుబడే ఎక్కువ. పరిమాణరీత్యా అతిపెద్దవయిన 500 బడాకంపెనీలలోని పెట్టుబడిలో ప్రభుత్వంవాటా, ప్రభుత్వద్రవ్యసంస్థల వాటా, ఆద్రవ్యసంస్థలు ఇచ్చిన ఋణాలు, కలిపితే 75 శాతం వుంటుందని అంచనా[5]. అటువంటి సందర్భంలో ప్రాంతీయ పెట్టుబడిదార్లు ప్రాంతీయతత్వాన్ని రెచ్చగొట్టి ఈ ద్రవ్యసంస్థలను నియతించే కేంద్రప్రభుత్వాన్ని బెదిరించగలిగితే, అటు తరువాత బలపడడం ఎదగడం ఎంతోకాలం పట్టదు.

ఈ సందర్భంలోనిదే మరొక విషయం. "ఒకవేళ ప్రాంతీయ బూర్జువా వర్గమే బలంగా వుంటే ఇంకెవర్నోవచ్చి పారిశ్రామికీకరణ చెయ్యమంటుందా" అని నిర్మల్ సేన్‌గుప్త ప్రశ్నించడం వృథ్వి అడిగినట్టు "అసంబద్ధ"మేకాదు, అర్థరహితం గూడ. వాళ్ళడుగుతున్నది "ఇంకెవర్నో" కాదు, ప్రభుత్వాన్ని. ఆపని మన పెట్టుబడిదార్లు ఎప్పటి నుండో చేస్తున్నారు. 1946 లో బడాపెట్టుబడిదార్లంతా కలిసి, స్వాతంత్ర్యం వచ్చింతరువాత కీలకరంగాలలో పారిశ్రామికీకరణ ప్రభుత్వమే నిర్వహించాలని అర్థించిన విషయం అందరికీ తెలిసిందే (దీన్ని Bombay Planఅంటారు)

## 3. ఈశాన్యభారతంలో బెంగాలీలు

"సురాపుస్తకంలో బెంగాలీలకు అన్యాయం చేశాడన్నది పాక్షికసత్యమే" వనయినా వృథ్వి గుర్తించినందుకు సంతోషం. కాని నేనన్నది సురా అస్సాంలోని బెంగాలీలకు పాక్షికంగా అన్యాయంచేశాడనికాదు, అస్సాంఉద్యమానికి గురవుతున్న 'బంగ్లాదేశీ'లకు సంపూర్ణంగాచేసాడని. మనదేశ ఫ్యూడల్ ఆర్థికవ్యవస్థ విచ్ఛిన్నతిగాని, జమీందారీ వ్యవస్థగాని, ఆహారధాన్యాల ఎగుమతిగాని, బెంగాల్‌కు కలిగించినంత నష్టం మరేయితర ప్రాంతాలకూ కలిగించలేదు. 1890 నుండి 1947 వరకు మన దేశంలో తలసరి వ్యావసాయిక ఉత్పత్తి సూచిక 100 నుండి 84కు పడిపోతే, 'గ్రేటర్' బెంగాల్‌లో 100 నుండి 54కు పడిపోయింది.[6] అంటే 1890లో వ్యవసాయరంగంలో ఉత్పత్తి తలసరి ఎంతవుండేదో, 1947లో దేశంమొత్తంమీద అందులో 84 శాతం వుంటే, బెంగాల్‌ప్రాంతంలో 54 శాతంమాత్రమే వుండింది. ఈనాటికీగూడ దేశంలో అత్యధికభాగం జనం తమ ఆదాయంలోఅత్యధికభాగం తిండికోసం ఖర్చుపెట్టే మన పరిస్థితులదృష్ట్యా ఈ గణాంకాలవెనుక ఎంతదారుణమయిన హింసవుందో ఊహించవచ్చు. దీనికి, లోగడచెప్పిన 1947 తరువాతి తూర్పుబెంగాల్ ప్రాంతీయదోపిడీనిగూడ చేరిస్తే, తూర్పుబెంగాల్‌నుండి ఈశాన్యభారతానికి నిరంతరంజరిగే రైతాంగపువలసకు గల కారణమేమిటో అర్థమవుతుంది. అస్సాంలో ఇవ్వాళ 'బహిరాగతు'లని పిలవబడుతున్న వాళ్ళంతా ఈ కోవకు చెందినవాళ్లేగాని, "ముందుగావచ్చిన జాతీయ చైతన్యమూ విద్యావ్యాప్తి" పాలకవర్గంగా మార్చినవాళ్ళుకాదు. జాతీయ చైతన్యాన్నీ విద్యావ్యాప్తినీ వాడుకుని ఈశాన్య భారతంలో ఆధిపత్యాన్ని సంపాదించుకున్న బెంగాలీలువేరు, ఇవ్వాళ అస్సాంఉద్యమానికి గురవుతున్న బెంగాలీలువేరు. త్రిపుర, అస్సాం, ఉద్యమాలకున్న మౌలికమయిన తేడాలలో ఇదొకటి. ఈశాన్యభారతంలో వున్న బెంగాలీలంతా కావడానికి ఒకజాతేఅయినా, ఒకజాతి కావడం వాళ్ళ ప్రధాన

లక్షణంకాదు. అందులో రెండు రకాలున్నారు. పీడకులుగా వెళ్ళినవాళ్ళు, పీడనకు ఫలితంగా వలసపోయినవాళ్ళు. ఈ తేడాగమనించకుండ వాళ్ళందనీ ఒకటిచేయడం సురాతప్పు. నేను దానిని వివరించినా పట్టించుకోకుండా "ఒకప్పుడు అణచబడిన జాతులే ఇతరప్రజలకు పీడకజాతులుగా తయారవుతాయ"ని అసందర్భంగా జార్జి థామ్సన్‌ను కోట్‌చేయడం పృథ్వి తప్పు.

అంతేకాదు, తిండికిలేక వలసవెళ్ళిన ఈ బెంగాలీలు వడ్డీ వ్యాపారస్తులుగా మారి భూములనాక్రమించుకోలేదు. (త్రిపురనుండి అదిలాబాద్ వరకు గిరిజనుల భూములు ఈరకంగానే ఇతరుల చేతులలోకి పోయాయి). కాయకష్టంచేసి కూడబెట్టిన డబ్బుతో మార్కెట్ ధరకంటె ఎక్కువ ధరకు కొన్నారు.[7] గిరిజన ప్రాంతాలలో పోడువ్యవసాయంస్థానాన స్థిరవ్యవసాయాన్ని ప్రవేశపెట్టి ఉత్పత్తిరంగంలో ఒక విప్లవాత్మకమయిన పరిణామాన్ని సాధించారు. వీళ్ళను త్రిపురలోని బెంగాలీ భూస్వామ్య-వడ్డీవ్యాపార వర్గాలతోకలిపి అందరినీ "బెంగాలీ జాతీయ దురహంకారం" పేరిట తిట్టడం దారుణమయిన అన్యాయం.

చివరిగా, సురా ఈశాన్యభారతంలోని అన్నిప్రాంతాలగురించీ ఒకేపుస్తకంలో రాసినందుకుకాదు, నేను ఈశాన్యభారతాన్ని ఒక్కయూనిట్‌గా పరిగణించడం తప్పన్నది. ఈశాన్యభారతంలోని వివిధప్రాంతాలమధ్య తేడాలున్నాయని అంగీకరిస్తూనే అక్కడ ప్రాంతీయదోపిడీ వుందన్న తన కీలకమయిన ప్రతిపాదనను సమర్థించ డానికి గణాంకాలు సేకరించడంలోమాత్రం ఈశాన్యభారతాన్ని ఒక్క యూనిట్‌గా పరిగణించాడు. ఆ విషయాన్నే నేను పేజీలతరబడి విమర్శించాను. అయినా "సురా ఈశాన్యభారతాన్ని ఒక్కయూనిట్‌గా పరిగణించాడన్నది పూర్తిగా అబద్ధం" అని పృథ్వి ప్రకటిస్తే నేనేంచెప్పేది ? తలసరి ఆదాయం, నీటిపారుదల సౌకర్యాలు, నిరుద్యోగం పరిమాణం, ఉత్పత్తి పెరుగుదలరేటు- అన్నీగూడ ఈశాన్య భరతానికి మొత్తంగా వర్తించేవే సురా ఇచ్చాడు. దానివల్ల ప్రాంతీయదోపిడీకి సంబంధించిన అతని ప్రతిపాదన ఋజువయినట్లనిపించింది. ఇప్పుడది - అస్సాంకు సంబంధించి - నిరుపయోగంఅని చూపించినతరువాత "తలసరి ఆదాయమే అభివృద్ధికీ అల్పాభివృద్ధికీ నిజమయిన ప్రమాణం" కాదేమోనన్న అనుమానం పృథ్వి వెలిబుచ్చినా (బహుశా సురా అంగీకరించినా) నాకు పెద్దగా అభ్యంతరంలేదు; ముఖ్యంగా, వలససంబంధానికి ప్రధాన లక్షణం వలస నుండి పెట్టుబడి నికర ఎగుమతి (net export of capital) అని ఇదివరకే సూచించాను. అయితే అస్సాం నుండి అటువంటి పెట్టుబడి ఎగుమతే

గాని జరుగుతూంటే, అస్సాంలోను దేశంమొత్తంలోను ఉత్పత్తి పెరుగుదలరేటు ఒకటే కావడం కష్టసాధ్యం (కాదని పృథ్వి అనుకోవడానికిగల కారణం, వలసఅంటే ముడిసరుకులనుత్పత్తి చేసే ప్రాంతమన్న తప్పుడు అవగాహన).

### చివరిమాట

ఇవన్నీ సైద్ధాంతికమయిన విషయాలు. వీటిని గురించి అంగీకారం అంత సులభం కాకపోవచ్చు. ముఖ్యంగా 'అంతర్గత వలస'కు సంబంధించి దుస్సాహసిక సిద్ధాంతాలు పాశ్చాత్య మార్క్సిస్టులలో ప్రబలంగా వున్నాయి. అసలు అసమాన అభివృద్ధికీ (uneven development) అంతర్గత వలస విధానానికీ (internal-colonialism) తేడానే రూపుమాపిన Andre Gunder Frank వంటి మేధావు లున్నారు. ఒక ప్రాంతంలో నిత్యావసర వస్తువులయినవి వేరొకచోట విలాసవస్తువులు కావా, కూలిరేట్లలో తేడాలులేవా, అని పృథ్వి వేసిన ప్రశ్నలో Frank సిద్ధాంతాల ప్రతిధ్వని వుంది. ఇదే నిజమయితే ఆంధ్రకు తెలంగాణాయే కాదు, ఈ దేశంలో గ్రామానికి గ్రామం, పట్టణానికి పట్టణం, వాడకువాడ, కొత్తబస్తీకి పాతబస్తీ, వలసలని గుర్తుచేయడం వినా నేనుదీని గురించి ఇంక చెప్పదల్చుకోలేదు.

సిద్ధాంతాలట్లాగుంచి, వాస్తవాలను మరొకసారి గుర్తుచేసుకుందాం. ఇవ్వాళ అస్సాం ఉద్యమానికి గురవుతున్న ప్రజలు "బెంగాలీజాతీయ దురహంకారులు" కారు. శ్రామికజనం, రైతాంగం; వీళ్ల అక్రమంగాను వడ్డీ వ్యాపారంద్వారాను అస్సాంలో భూములు సంపాదించుకోలేదు. గతిలేక అస్సాం వచ్చారు, కష్టించి భూమి సంపాదించుకున్నారు. తమ చరిత్రచేత అమానుషంగా హింసించబడ్డ ఈ ప్రజలను ఆ చరిత్రే మరొక్కసారి హింసించడానికి ఉద్యుక్తమవుతూంటే, అస్సాం ఉద్యమంపట్ల తమకున్న సద్భావాన్ని విడనాడకుండానే, వీళ్లకు అసహ్యాకరమయిన పేర్లు పెట్టకుండ కొంచెం సానుభూతి చూపించలేరా? అస్సాం ఉద్యమాన్ని సమర్ధించడం అంటే వీళ్లకు లేనిదుర్గుణాలు అంటగట్టడమేనా? మనం జడాత్మకంగా ఆలోచించడం ఎప్పుడు మానేస్తాం?

— కె. బాలగోపాల్

### సూచికలు

1. సృజన, అక్టోబర్ 1981
2. రెండు సంవత్సరాల క్రితం 'సోషల్ సైంటిస్ట్' పత్రికలో చదివిన సమాచారం. అంచనావేసింది ఇర్ఫాన్ హబీబ్ అనుకుంటాను. వ్యవధి ఇస్తే సరయిన రిఫరెన్స్ ఇవ్వగలుగుతాను.

# "ఒక్కటైతే...?"

## తుమ్మేటి రఘోత్తంరెడ్డి

సూర్యుడు అస్తమించిన పడమటి ఆకాశం.... సింధూరంలా, మందారంలా- నేటి రాజకీయవేత్తపార్టీలు మార్చినట్టు, క్షణం క్షణం రంగులు మారుస్తోంది.

మేతకెల్లిన పశువులు ఊళ్ళోకి ప్రవేశిస్తున్నయ్. పశువుల్ని తప్పుకుంటు 'దబ దబ' అడుగులేస్తూ ఇంటికి వస్తోంది కాంతమ్మ నెత్తిమీద కలుపుతీసిన బాపతు పచ్చిగడ్డి బరువు హెచ్చినట్టు అవుతోంది.

"హబ్బ.... రాను రాను ఏతురోకలి అయినట్టు- బరువు కావట్టైన- ఎదురుంగ నన్న రాకపాయె!.... దొరికినయో లేదో? ఏంజేత్తాందో? కోళ్ళు బాతులు ఆగం ఆగం అయితాండాలె. బర్రె అచ్చి దుడ్డెను సీకిచ్చుకుంటాందో ఏందో?" కాంతమ్మ అందోళనపడుతూ ఇల్లుచేరింది.

లోకసభలో సభ్యుల ముష్టి, వాగ్యుద్ధాల్లా, కోడి, పిల్లలు, బాతులు 'కయ్యర కయ్యర' మొత్తుకుంటు కలియబడుతున్నయ్. దుడ్డె దగ్గరికివెళ్ళి బర్రెపాలు చీకించుకుంటోంది. కాంతమ్మ నెత్తిమీద పచ్చిగడ్డిమోపును చూసి దుడ్డెను ఒక్కతన్ను తన్ని బర్రె కొట్టంలోకి పరుగెత్తుకొచ్చింది.

గడ్డిమోపును పట్టులోవేసి తలుగు అందుకుని బర్రెను కట్టేస్తూ.

"దీనింట్ల మన్నువడ సీకిచ్చుకోనె సీకిచ్చుకుంటాంది. ఊఁ.... ఈనె ఎటువోయి నట్టు?" అంటూ కొట్టంలోంచి బయటకువస్తూ ఇంట్లోకి చూసింది. ఇంట్లో దీపం

---


3. Monthly Review, ఏప్రిల్ 1980, సంపాదకవ్యాసం
4. రిచర్డ్ నేషన్స్, The economic structure of Pakistan and Bangladesh. రాబిన్ బ్లాక్ బర్న్ ఎడిట్ చేసిన Explosion in a subcontinent అనే సంకలనంలోని వ్యాసం.
5. J. D. సేథ్, ఇండియన్ ఎక్స్ ప్రెస్ దినపత్రిక, అక్టోబర్ 30, 1981.
6. M. L. దాంత్ వాలా, Poverty in India, Then and Now. 1870 1970. (Macmillan Co.)
7. అమలేందు గుహా, Planter Raj to Swaraj (ICHR, Delhi). ఇది గుహా చెప్పిన బెంగాలీ అబద్ధం కాదనడానికి నిదర్శనగా దీని తిలోత్తమ మిశ్రి- ప్రముఖ అస్సాం ఉద్యమమేధావి- తాను మదరాస్ సెమినార్లో చదివిన వ్యాసంలో వుటంకించింది.

మిణుకు మిణుకు మంటూ వెలుగుతోంది. మనిషి అలికిడి లేదు. వెనక్కి తిరిగి చూసింది. చిన్న పాలేరు గడ్డిమోపుతెచ్చి వడేశాడు.

"ఆ కోళ్ళను బాతుల కమ్మరా" అని వానికి పనిపురమాయించి కాంతమ్మ ఇంట్లోకి నడిచింది. అప్పటికే చీకట్లు చిక్కగా-దేశపు సమస్యల్లా ముసురుకుంటున్నయ్.

ఇంటిలోపల అరవిలో- దీపం ముందుకూర్చుని 'బోరెం' ముడుస్తూ ఉన్నాడు రంగారెడ్డి. ముడుస్తున్న బోరెంను చూసి

"ఎడ దొరకలేదా? అని అడిగింది.

"లే...." రంగారెడ్డి క్లుప్తంగా సమాధానమిచ్చాడు.

"కోటవటి లింగయ్యను అడుగకపోయినవు, నాలోవ్రజులు ఆగినంక ఇత్తులమ్మి కచ్చి ఇత్తనని."

"అడిగిన- లెవ్వన్నడు- అడుగంగ అడుగంగ అయిదు సొప్పునైతె నాలుగు వందలిత్తనన్నడు."

కాంతమ్మ ఏమీ మాట్లాడలేదు. కాళ్ళు చేతులు కడుక్కొని ఎసరు పెట్టడం కోసం 'ఎస్ల'తీసుకుని బాయి మీదికి వెళ్ళి ఇంట్లోకి వచ్చేసరికి, బోరెం బండిలోవేసి కుంచం, అంచెలు తీసుకుని గుమ్మి దగ్గరికి వెళ్ళాడు రంగారెడ్డి

"సద్దికి బియ్యం పెట్టనా? అంది కాంతమ్మ.

"పెట్టుపుగనిరా - గీన్నిఇత్తులు బండ్లెవోసినంక"

కాంతమ్మమనసు ఉస్సురంది- పగలంత వంచినసడుం ఎత్తకుండ మొక్కజొన్న పెరట్ల కలుపుతీసింది. ఇదీ వచ్చేపోయే వానజల్లుకులడుస్తూ. అయినా తప్పు తుందా? ఇత్తులుఅమ్మితేనే పొలంలోకిఎరువు. ఎరువుతెస్తేనే పొలంనాటు. ఆ నాటు అయితెనే మనసుకికాస్తా స్వస్థత.

రంగారెడ్డి గుమ్మిలోంచి వడ్లుకొలిచి అంచెలోపోసి ఇస్తాంటె కాంతమ్మ తీసుకువెళ్ళి బండిలోపోస్తోంది- కంచెలో ఎడ్లమేపడానికివెళ్ళిన కొడుకుకూడ అప్పుడే వచ్చాడు. పేరు చంద్రారెడ్డి- కొట్టంలో ఎడ్లకట్టివేసి గబ గబ బండిదగ్గరికివచ్చి చిన్న పాలేర్ను అడిగాడు. "బండి జమ్మికుంటకారా?"అని.

"అఁ అన్నాడువాడు. కాళ్ళతో బోరెంలోని వడ్లను తొక్కిసరిచేస్తూ- చంద్రిరెడ్డి కూడ బండిఎక్కి వడ్లుసరిచేస్తూ తొక్కుతున్నాడు- వారిద్దరు 'గుసగుస' లాడుతున్నరు.

"ఒక్కడైతే.... ?"

"ఆఁ నిన్నుతీస్కపోడు, నన్నేతీస్కపోతడు" పాలేరు.

"అహ- సూడు- నన్నే తీస్కపోతడు 'పైలు' కొనుక్కోవాలె". ఆరోక్లాసు చదువుతున్నవాడికి చదువుమీదశ్రద్ధ. వాడికంటె కాంతమ్మకి మహాశ్రద్ధ. "వాన్ని సదివియ్యాలె. ఎన్నికష్టాలుపడ్డాసరె ఎద్దుముడ్డి పొడవబెట్టద్దు" ఈ విషయంలో ఆమె చాలా పట్టుదలగావుంది.

"గుమ్మి ఊడ్సిపోత్తవా ?- పోసి తెల్లారేందింటవు ?" అసహనంగ నాలుగో సారి అంది కాంతమ్మ. రంగారెడ్డి కొలుస్తూనే వున్నాడు. ఆమెకుతెలుసు ఆయన ఏం మాట్లాడడని. మౌనంగ పనిపూర్తి చేసి దుమ్ము దులుపుకుని వంటప్రియత్నంలో మునిగింది.

రంగారెడ్డి బోరెంవదిచి బండికి కట్లుకట్టి ఆకాశంకేసి చూశాడు. సమయం కోసం. ఆ డమాసం గుడ్డివెన్నెల మేరుపర్వతాల్లా నల్లని మేఘాలు కారుదున్న పోతుల్లా కదిలిపోతున్నాయ్.

"వాన అచ్చేటట్టు వున్నది. బండి కొట్టంల పెడ్తాం ఆసరపట్టరా" అంటూ కొడుకును, పాలేరునిపిలిచి బండిని కొట్టంలోకి నెట్టారు.

"ఇగపో.... పొయ్యి పొద్దుగాలరా కస అమ్మకు అలుక్కు పూతకు ఆసరగా ఎడ్లు గొడ్లు పదిలం" పాలేరు గుండెల బండ పడ్డంత పనిఅయింది. కొడుకు ముఖం చీకట్లో విప్పారింది అల్లిపూవులా. పాలేరు దిగులుగా ఇంటిదారి పట్టాడు.

X X X X

పడుకున్న రంగారెడ్డి మెదట్లో ఎన్నో ఆలోచనలు తేనెటీగల్లా ఓకొలిక్కరావు వస్తైఅర్థంకావు. బయట ఆకాశం ప్రసవ వేదనపడి హోరున గాలి వర్షం పచ్చివెలిసింది ఇక రంగారెడ్డికి నిద్రపట్టడంలేదు.

"నడిజాము దాటివుంటది. పోవాలె, లేకపోతే 'టీటి అందది' లేచి భార్యని కేకే సిండు ఆమె తృళ్ళిపడి లేచింది కోడికునుకులాగ ఒక నిద్రలేసింది అంతే లేచి చద్ది కట్టడంకోసం వంటింట్లోకి వెళ్ళింది కొడుకును లేపి పదిసార్లు పిలిచినా లేవనివాడు ఒక్కపిలుపుకే లేచాడు. వాడికి నిద్రలో కూడ అదే యావ.

రంగారెడ్డిబండికట్టి వీధిలోకి తీసిండి. పగ్గాలు కొడుకు చేతికి అందించి బండి ముందు నిలబడ్డాడు.

కాంతమ్మ మౌనంగా ఒంకిలో సర్దిముల్లెపెడ్తూ- "పదిలంబిడ్డా! బాపు ఆటూ ఇటూపోతే, వడ్లకుప్ప పదిలం- పంతులురాసిచ్చిన 'పైల'సిల్కు బాపుకియ్యి, కొనిత్తడు" అంది.

ఈ గొడవలేంపట్టనట్టు నెమరువేస్తున్న ఎడ్ల అమాయకపు ముఖాలకేసి చూస్తున్నాడు రంగారెడ్డి. ప్రకృతి నాచినపులిలా నిశ్శబ్దంగాఉంది.

బుజంపై చిరిగిన రవికను ఓసారిచూసుకుని కొంగు బుజాలచుట్టు కప్పుకుంటూ చెప్పలేకలేకచెప్పింది- రవిక గుడ్డతెమ్మనికాదు.

'ఇల్లు ఊడ్చినట్టున్నది తులం నూనెసుక్కలేదు. పైసలుమిగుల్తె ఓ అంగి బట్ట తెచ్చుకో. ఎటన్నపోతె ఓ అంగిపేగన్నలేదు-" చెప్పాల్సినవిఉన్నా చెప్పలేక పోయింది, రంగారెడ్డి మౌనంచూసి.

రంగారెడ్డి ఏమీఅనలేదు. బండెక్కి కూర్చున్నాడు.

"ఎపైతెగటాయె- ఎవతన్న అత్తెనేమో అచ్చింది మూడురూపాలకు. లేకుంటె నల్లరితోని నేనను, తీస్కపొయ్యి నారుపీకు- ఎటుతిరిగి రేపు అంబటాల్లకు నాటుకు అందత్తె."

కాంతమ్మ 'సరే'నన్నట్టు మౌనంగ తలఊపింది. బండికదిలింది- మెత్తని తడినేలపై. 'రేపటిగతిఎట్ల'? బండి చీకట్లో కల్సిపోయేంతవరకుచూసి అనుకుంటూ ఇంట్లోకి నడిచిందికాంతమ్మ.

దాదాపు ఇరవై కిలోమీటర్లు- రేగడిబురదలో పీక్కుంటూ- వాగు, వంతలు దాటి జమ్మికుంట మార్కెట్ రోడ్డెక్కిందిబండి. ఎండవేడికాస్తా తీవ్రమౌతుంది. మార్కెట్‌కు వెళ్ళేబండ్లు, రంగారెడ్డి బండికిముందు వెనకా బారానెఉన్నయ్.

"ఏఊరయ్యా- పచేలా"?" చెంగావిపంచె నెత్తిమీదవేసుకుని, కాంటా పుస్తకం చంకలో ఇరికించుకుని ఇకిలించాడోక అడ్తీగుమస్తా.

"రంగయ్యపల్లె" రంగారెడ్డి ముక్తసరి సమాధానం-

"ఎవరిఅడ్తీ?" మరో ముసలిగుమస్తా అద్దాల్ని ఎగదోసుకుంటు-

"కైలాసంఅడ్తీ"

నగదు ఇప్పిస్తామంటూ ప్రతిఅసామిని మా అడ్తికిరా అంటె మా అడ్తికిరా! అని వేధిస్తున్నారు.

ఏఊరయ్యా-పటేలా? ఎవలడ్తి? అయినో కుర్రిగుమస్తా అడగ్గానే చిర్రెత్తు కొచ్చింది రంగారెడ్డికి.

"ఎల్లైఊరు- కాసిల గంగరాజవనిఅడ్తి, నీతల్లి.... గబ్బిలాలుతలిగినట్టే".

బండి మార్కెట్లోకి ప్రవేశించింది- మార్కెటునిండ చిక్కగా- దేశజనాభాలా బండ్లు- ఎడ్లు, మనుషులతో కిటకిటలాడుతోంది. అరుపుల కేకల ధ్వనుల్తో కోలాహలంగ అదో గందరగోళపు సంతలా ఉన్నది.

ఎప్పుడూ వెళ్ళే అడ్తీ గద్దె దగ్గరికి వెళ్ళి రంగారెడ్డి బండి ఆగింది కొడుకును బండి దిగమని అటూ - ఇటూ చూస్తున్నాడు మనిషి సాయంకోసం.

"ఏం పటేలా వానబాగ కొట్టిందా అటు.?" అడ్తీగుమస్తా వెంకటనర్సయ్య పనిలేని పలకరింపు ప్రశ్న.

"ఆఁ బాగనే కొట్టిందిగాని గిట్ల గీ బండి గద్దెదగ్గరికి పట్టు" అని బండిలోని వడ్లను తోడి కుప్పబోశాడు- బంగారపురంగులో మసూరివడ్లరాసి. రాయి, రప్ప లేకుండచేసి రాసిని శుభ్రం చేశాడు.

"బాపు.... ఆకలి" అంటు చాలాసేపట్నుంచి గుణుస్తున్నాడు కొడుకు.

"శేటు ఉన్నాడా?" రంగారెడ్డి వెంకటనర్సయ్యని అడిగాడు.

"ఆఁ- ఉన్నడు రెండోనంబరు గద్దెదగ్గర పాట మొదలైంది. ఆన్నే ఉన్నడు."

"సరె గడిసేపు ఇటు సూడు ఎంకటనర్సయ్యా గా నల్లదాకావోయ్యి రెండు బుక్కల సద్దితిని అత్తం." అని చెప్పివెళ్ళి తినివచ్చేసరికి రంగారెడ్డి ధాన్యం ధర నిర్ణయించారు.

అసామి లేకపోతేనేం? అడ్తీదారుడుంటె చాలదా? అమ్మేవాడిదేం లొట్టపీసు అమ్మించేవాడిదిగాని.

"ధర అయిందా? ఎంకటనర్సయ్యా?" అత్రితగా అడిగాడు రంగారెడ్డి.

"అంఁ- నూటఇరవై" కాంట పుస్తకంలో వివరం రాసుకుని చెప్పివెళ్ళాడు వెంకటనర్సయ్య.

కొన్నవాడి తాలూకు ఆడకూలీలు నల్గురు కొన్ని ఖాలీసంచుల్తో వచ్చారు.

"ఇవి షా శేటు కొన్నడట, ఎత్తుతానం పటేలా" అని సమాధానం కోసం

చూడకుండా వడ్లు సంచుల్లోనింపి వెళ్ళారు దోసెడువడ్లు అడుక్కొని.

పొద్దువాలింది ఆకాశం మేఘావృతమైంది. అంతా ఆదుర్దాపడుతున్నారు. హమాలీలు 'కాంటాలు' సరిగా సర్దుతున్నారు. 'దాడవాయిలు' చెయ్యికి చిన్న చేడబ్బాలు తగిలించుకుని వచ్చి కాంటాల దగ్గర నిలబడ్తున్నారు.

"కాంట మొదలుబెట్టుడు అల్సంగ మొదలు బెట్టపట్టిరి ఏందయ్యా? ఎంకట్నర్సయ్యా?" గద్దెలమీద కాంటల్ని సరిచేస్తున్న హమాలీలను చూస్తూ రంగారెడ్డి అడిగాడు.

"ఆఁ- ఇంకనయం మొత్తానికే పనులు బందువెడ్తమని కూసున్నరు." కాస్తా తెరిపినపడ్డట్టు ధాన్యంబస్తాపై కూర్చుంటూ చెప్పాడు వెంకటనర్సయ్య.

"ఎవలు"? ఆత్రుతగా అడిగాడు రంగారెడ్డి.

"ఎవలా? హమాలీలు, దాడవాయిలు, ఆడోళ్ళు ఇంత మార్కెట్ల పనిచేసే టోళ్ళందరు."

"ఎందుకని" రంగారెడ్డి.

"ఎందుకేంది కూలిపెరుగాల్నని"

"నీతల్లి ఎవల్నుసూడబెయినా మంచిగనే వున్నది. ఆఁ మరేమైంది! మళ్ళెట్ల పనికచ్చిరి?"

"ఎట్లేంది! రామబారాలు నడిపిచ్చింద్రు సేట్లు. ఆఖరికి ఇయ్యాల ఒక్కరోజు పన్జేసి రేపట్నుంచి బందువెడ్తరట గండుకని." అంటూ బస్తాపైనించిలేచి కొద్దిదూరం వెళ్ళాడు ఎవరికోసమో.

జోరీగలా ఓ బిచ్చపుది మొత్తుకుంటుంటె పిడికెడు వడ్లు దానికి వేశాడు రంగారెడ్డి. అంతట్లోనె కాంట మొదలుపెడ్తున్నాం రావయ్యా ఎంకటనర్సయ్యా. అంటూ ఖరీద్దార్ తాలుకు గుమస్తావచ్చి కాంటా దగ్గిర నిలబడ్డాడు. దాడవాయి చిన్న చేడబ్బా గిరగిర తిప్పుతూ కాంటా సపోర్టు పైపుకి ఒరిగి నిలబడ్డాడు.

హమాలీలు ఒక్కొక్క బస్తాతెచ్చి కాంటకి వేస్తున్నారు. రంగారెడ్డి జాగ్రత్తగా తూకాన్ని చూస్తున్నాడు- ఖరీద్దారు తాలూకు గుమస్తా దాడవాయిని తొందర చేస్తున్నాడు 'దబదబ జోకవయ్యా' అని-"రంగారెడ్డి మెల్లగా జోకవయ్యా" అని కోప్పడుతున్నాడు ఇద్దర్నీ సంతృప్తిపర్చలేక పోతున్నాడు దాడవాయి ఖరీద్దార్లకి కోపంవచ్చేట్టుచేస్తె

మాత్రం తన పనిసున్న అని ఆ దాడవాయికి తెలుసు- కాంటాతూకం ధాన్యం బస్తా పైపు అధికంగా వుంది అదే చివరిబస్తా- చేదబ్బలో డబ్బెడు వడ్లుతీసుకుని ప్రక్కనే వున్న తన సొంతసంచిలో పోసుకున్నాడు దడవాయి. మరిన్నితీసి హమాలీలకు పెట్టాడు- రంగారెడ్డికి 'చిర్రిన' కోపంవచ్చింది.

"గదేంది " అని రంగారెడ్డి అడిగితె-

"అంతే" అన్నట్టు నిర్లక్షంగా చూశాడు దడవాయి- ఖరీద్దార్ గుమస్తా చూసి చూడనట్టు ఊరుకున్నాడు.

'ఏంవయ్యా ఎంకట్నర్సయ్య గట్ల అడ్డగోలుగతీసి కాలవెట్టుకోవట్టిరి- నీతల్లి జోకుడుపెండ్లాం ముండమొయ్య-' రంగారెడ్డి.

ఆనవాయితీ ప్రకారం వెంకటనర్సయ్య రెండుమాటలు కోప్పడ్డాడు దడవాయిని

స్వతంత్ర భారతదేశపు వెన్నెముకఅయిన రైతుని ఖరీద్దార్లు, అడ్తీదార్లు కాకుండ దడవాయిలు సహితం 'ఉడుతాభక్తిగ' దోపిడి చేస్తున్నారు.

కాంటా అయిపోయింది. మూడు క్వింటాల తొంభై అయిదుకిలోలు. రంగారెడ్డి ప్రాణం 'దస్'మన్నది. "ఇంక అయిదుకిలోలు ఏడవోయినట్టు? సరిగ్గ ఎనిమిది గిద్దెలుపోసిన? ఆం."

ఏడవోయినయో తెల్వకముందే వెంకటనర్సయ్య లెక్కచిట్టి చేతిలోపెడ్తూ "మూడు కింటాల తొంభై అయిదు కిలోలు" అన్నాడు. ఆ చిట్టిని కొడుకు అందుకుని చూసి ఆ తెలుగు అంకెలు తెలియక మళ్ళీ తండ్రికి ఇచ్చాడు.

రంగారెడ్డి మనసు లెక్కవేస్తూంది.

'మూడు కింటాల తొంభై అయిను కిలలు- అయితె అయిదు తక్కువ నాలుక్వింటా లన్న మాట, నాలుగిటికి నాలుగునూర్లు- నాలుగు ఇరువైలు- నాలుగునూర్ల ఎనుబై అన్న మాట- అండ్లఅచ్చేటియి ఎన్ని? పొయేటియి ఎన్నో?'

రంగారెడ్డి ఆలోచనలు పూర్తి కాకముందే సంచిమీదినుంచి లేస్తూ

"బస్తాలు ఏంవైన అక్కెరా? పచేలా?" అని అడిగాడు వెంకటనర్సయ్య.

"ఆం అక్కెరే- కని ధరెట్ల?"

"బజార్ ధరే- ఎన్నిగావాలె?"

"రెండు కోరమాండల్ బస్తాలు-"

"ఇంకా...." చిట్టీమీదరాస్తూ అడిగాడు వెంకటనర్సయ్య

"ఒక్కటికీ ఓ సత్తిపిండి బస్తా"

"అంతేనా ?

"అంతే"

"ఈ చిట్టి తీస్కో.... తీస్కోని లింగశెట్టి గిర్నిలకు పొయ్యి బస్తాలు ఏయించు కచ్చుకో. అచ్చినంక లెక్కచూసి అచ్చిన కాడికి పైసలిత్తడు శేర్" కాంటా పుస్తకం మూస్తూ అన్నాడు.

"లింగశెట్టి గిర్ని ఎక్కడ ?" రంగారెడ్డి.

"అయ్యో నీవడ్లుకొన్నది ఆయినే. మూలమీదికిపొయ్యి ఎవల్నడిగినా సెప్పుతరు".

మార్కెటు పల్చబడుతోంది. ఎండతీవ్రత తగ్గుతోంది. రంగారెడ్డి బండి కట్టుకుని లింగశెట్టి ఆయిల్ మరియు రైస్‌మిల్లులకు పోయిండు.

మెత్తని పరుపులో కూర్చుని ఎవర్తోనో ఫోన్లో మాట్లాడుతున్నాడు లింగశెట్టి. నల్లని చింతపండు బస్తాలా వున్నాడు రంగారెడ్డి ఇచ్చిన చిట్టీ తీసుకుని, బస్తాలు బండ్లోవెయ్యమని ఓ హమాలికి పురమాయించాడు.

"ధరెట్ల ?" రంగారెడ్డి

"నూటతొంబై, కోరమాండల్, డెబ్బై సత్తిపిండి." తొణక్కుండా లింగశెట్టి సమాధానం. రంగారెడ్డి ప్రాణం దస్ మన్నది. 'వీని నోటికచ్చిందే పాపం పున్నెమున్నది' అనుకున్నాడు.

బస్తాలు బండ్లో వేయించుకుని అడ్తీదారు ఇంటికి వచ్చేసరికి అడ్తీదారు మెత్తని మెత్తలకు ఒరిగి ఇరవైరూపాయలు, లెక్కచిట్టీ చేతిలో పెట్టాడు- తన కమీషన్ మినహాయించుకుని.

రంగారెడ్డి మనసు భారమైంది.

"బాపూ పుస్తకాలు" పొద్దుట్నుంచి ఒకటే గునుపు. ఇరవైరూపాయలు కొడుకు చేతిలో పెడ్తూ "కొనుక్కచ్చుకోపో" అన్నాడు.

"బండెడువడ్లకు మూడు బస్తాలా? నీతల్లి ఎగుసాయం పెండ్లం ముండమొయ్య ఏం ఎగుసాయం ?" రంగారెడ్డి బండిలోకి చూశాడు 'మూడు పళ్ళుంచుకుని మిగతా వన్ని ఊడకొట్టించుకున్న దౌర్భాగ్యుడి నోరులా' బండి బోసిగావుంది.

రంగారెడ్డి చేతిలో వృథ లెక్కచిట్టి తప్ప బీడిముక్కకి కూడ పైసలేదు. కాంతమ్మ మాటలు జ్ఞాపకం వచ్చినయ్.

"ఇల్లు ఊడ్చినట్టున్నది తులం నూనెసుక్క లేదు. పైసలుమిగుల్తె ఓ అంగి బట్టతెచ్చుకో- ఎటన్నవోతె ఓ అంగిపేగన్న లేదు." రంగారెడ్డి పాణం ఉస్సురంది. అంగిగుడ్డ తీసుకోలేకపోయి నందుక్కాదు. చిరిగిన రవికతో భార్యపడే అవస్థ తలుచుకుని.

"ఏంసుఖపడ్డది అది, నన్నుచేసుకోని"? రంగారెడ్డి నిర్వికారంగా కూర్చుని ఉండిపోయాడు. అడ్తీదారు ఇంటికివచ్చిన చుట్టుపక్కల బండ్లరైతులు ఎవరిపనివారు చేసుకుంటున్నారు. బండి 'రేక'బద్దకివొరిగి ఖాళీగఉన్న బీటిలోకిచూస్తున్నాడు. చెల్లా చెదురుగఉన్న మార్కెటుకూలీలు ఒక చెట్టుకిందికి గుమిగూడుతున్నారు.

ఎవరో రైతుస్త్రీ గడగడ వాగుతూవస్తోంది.

....అమ్మవోతెఅడివి- కొనవోతెకొరివి- ఈ కలిగం పాడువడ- మునిగిపోయేం దుకే ఉన్నట్టున్నవి. వానింట్లపీనుగెల్ల గుత్తికాయకే(వో కింటలు మూడువందలైతె, నూనె కిల పదారట! కొలుకదిలియ్యకుంట దోసుకోవట్టిరి- అడ్డులేదాయె అయిపు లేదాయె. అడ్డన్నోడు దోసుకతిన్నట్టు, బీళ్లై వాని నోటికచ్చిందే పుణ్యం- దూకాండ్ల వాళ్ళ నోటికచ్చిందేపాపం." అంటూ వొడిలోతెచ్చుకున్న చిల్లరసామానును బండిలో సర్దుతోంది. ఆ ముసలమ్మ మొహంమీద ముడుతలు. అనుభవించిన కష్టాలకి కడ గండ్లకి నిదర్శనంగ ఉన్నయ్.

రంగారెడ్డి ఆ మాటలువిని ఆమెవంకచూసి తల నిలువుగాఆడిస్తూ ఆలోచనల్లో పడిపోయాడు. ఎదురుగా పొడవైన నూనెమిల్లు తాలూకుగోడ. దానిమీద రాజకీయ నాయకీనాయకుల చిత్రాలతో- వాగ్దానాలతో చెయ్యి- రాట్నం- రైతునాగలి, కంకి కొడవలి మున్నగు నానారకాలగుర్తుల్తో రాతల్తో గోడ నానాకంగాళీగావుంది. రంగా రెడ్డికి అసహ్యమనిపించింది. తుపుక్కున గోడపైకి ఉమ్మాడు.

రంగారెడ్డి కుడివైపుకి చూశాడు- మార్కెట్లో కూలిలైన హమాలీలు- గంప స్త్రీలు- బండ్లవాళ్ళు ఇంకా ఎందరోపనివారు బాగాగుమిగూడారు. ఆ గుంపుమధ్య లోంచి ఓయువకుని గొంతు విన్పిస్తోంది ఆవేశంగా.

"....అందుకని మనం(వంత రేపట్నుంచి పనులు బందువెట్టాలె- లేకుంటె కలుత్తలేదు. ఎన్నిసార్లసెప్పినా శేట్ల తలకెక్కుతలేదు. గందుకని ఇగమనం పనులు బందువెట్టి కూలిపెంచుకునుడుతప్ప ఏరేమార్గంలేదు. అట్టిఅట్టిగ ఎవడూ ఇయ్యడు. పోరాడందే ఏదైనారాదు ... గందుకని మనం(వంత ఒక్కటై పోరాటం చెయ్యాలె....

ఇంకా ఏదో ఏదో మాటలు విన్పిస్తున్నాయి రంగారెడ్డికి కొత్తగాను, ఉత్తేజం గానూ అన్పిస్తున్నాయి- రంగారెడ్డిలో కొత్తస్పృహ. "గిట్ల మా ఎగుసాయదార్లంత ఒక్కటైతే ?" రంగారెడ్డి ఆలోచిస్తున్నాడు.

# ఛత్తీస్‌ఘర్ - జాతి సమస్య

శంకర్ గుహనియోగి

[జాతులసమస్యపై సాగుతున్న చర్చలో భాగంగా మద్రాస్ సెమినార్‌లో చదవ బడ్డ వ్యాసాలలోంచి కొన్ని వ్యాసాలు ఏరి సృజనలో ప్రచురించ దలుచుకున్నాం. ఆ వరుసలో మొదటిదిగా శంకర్ గుహనియోగి ఛత్తీస్‌ఘర్‌పై చదివిన వ్యాసానికి స్వేచ్ఛానువాదం కింద ప్రచురిస్తున్నాం.]

భూమి, ప్రజలు :

మధ్యప్రదేశ్‌లో 18 డిగ్రీల అక్షాంశంనుంచి 24 డిగ్రీల అక్షాంశంవరకు, 80 డిగ్రీల రేఖాంశం నుంచి 84 డిగ్రీల రేఖాంశంవరకు విస్తరించి ఉన్న ప్రాంతాన్ని ఛత్తీస్‌ఘర్ అని పిలుస్తారు. ఈ ప్రాంతం విస్తీర్ణం 52,6?0 చదరపుమైళ్ళు, జనాభా ఒకకోటీ ఇరవైఐదులక్షలు ఛత్తీస్‌ఘర్ ప్రాంతంలో ఏడు జిల్లాలున్నాయి. ప్రాచీన కాలంలో ఈ ప్రాంతాన్ని 'దక్షిణ కోసల' అనీ, 'రతన్‌పూర్' అనీ, 'దండకారణ్య' అనీ, 'గోండ్వానా' అనీ పిలిచేవాళ్ళు. చారిత్రిక ఆధారాల ప్రకారం ఛత్తీస్‌ఘర్ అనే పదం మొట్టమొదటి సారిగా 1487 లో ఒక జానపద కవి రచనలో వాడబడింది.

భౌగోళికంగా ఛత్తీస్‌ఘర్‌ను రెండుప్రాంతాలుగా విభజించవచ్చు. మైదాన ప్రాంతం, కొండప్రాంతం.

ఛత్తీస్‌ఘర్‌లో విస్తారమైన ప్రకృతి వనరులున్నాయి. వరిసాగుకు అనువైన విశాలమైన భూమిఉంది. భూమిలో ఇనుము, బొగ్గు, సున్నపురాయి, డోలమైట్, క్వార్ట్‌జైట్, రాగి, యురేనియం, తగరం, బాక్సైట్, ఫ్లోర్‌స్పార్, మాంగనీస్ మొదలైన ఖనిజాల నిలువలుఉన్నాయి. అడవిప్రాంతంలో టేకు, సాల్, విప్ప, టెండు, సజా, బిజాలాంటి ఎంతోవిలువయిన వృక్షసంపదఉంది. శివనాథ్, మహానది, అర్పనదుల్లో ఏడాదిపొడుగునా నీరు ప్రవహిస్తూనే ఉంటుంది.

ఈ ప్రాంతంలో చారిత్రిక క్రమంలో వివిధ వ్యాపృత్తుల ప్రజానీకం మధ్య సంధానం జరిగింది. ప్రజలు వివిధ బాషలు మాట్లాడినప్పటికీ అందరికీ ఒక విశిష్టమైన సంస్కృతీ, అందరికీ ఆప్రాంతం అభివృద్ధికీ, అక్కడి ప్రజల అభివృద్ధికీ అంకితమయ్యే ఆలోచనా ఉన్నాయి. ఎంతో కాలంగా ఇక్కడ కొనసాగుతున్నవి భూస్వామ్య ఆర్థిక సంబంధాలు. ఈ భూస్వామ్య విధానపు ఒత్తిడివల్ల ఆదివాసుల ప్రత్యేక ఆర్థిక జీవన విధానమైన ఆదిమకమ్యూనిజం దాదాపు అంతరించిపోయింది.

ఈ ప్రాంతంలో వ్యవసాయమూ, పరిశ్రమలూ సాంప్రదాయిక రీతిలో కొంత అభివృద్ధి సాధించాయి. ఉదాహరణకు చెక్కతో అందంగా మలచబడిన శిల్పాలు ఈ ప్రాంతపు చెక్కపనివాళ్ళ కళానైపుణ్యాన్ని తెలుపుతాయి- ఇప్పటికీ అక్కడక్కడా కుప్పలుగా కనిపించే లోహాల రజనునుబట్టి ఒకప్పుడు ఈ ప్రాంతంలో చాలా అభివృద్ధి చెందిన లోహకళ ఉండేదని తెలుస్తుంది. ఆదివాసుల్లో 'అఘెరియా' అనబడే వాళ్ళు ఇనుము పోతపోస్తారు- కోష్టప్రజలు బట్టలునేస్తారు, కలార్ ప్రజలు విప్పపూలనుంచి మత్తుపానీయాలు తయారుచేస్తారు.

చిన్న చిన్న కొండలమీద పారే సెలయేళ్ళకు ఆనకట్టలుకట్టి నీటిని పాతపద్ధతులలో వ్యవసాయానికి వాడుకుంటారు- వ్యవసాయంలో 'గోట' అనే పద్ధతి ఉండేది. ఈపద్ధతిలో మొత్తం ప్రజలందరూ ఒక వ్యక్తి పొలంలో పనిచేస్తారు- దానికి బదులుగా ఆ వ్యక్తి ఆరోజున గ్రామానికంతటికీ మాంసంతో భోజనం ఏర్పాటు చేస్తాడు- సామూహికవేట జరుగుతుండేది- వచ్చిన దాన్ని అందరూ భాగాలువేసి పంచుకునేవాళ్ళు. కుక్కలకుకూడా కొంతభాగం అందేది. పలాష్ చెట్లనుంచి లక్క తయారు చేసేవారు- కోశపురుగులనుంచి తయారయ్యే సిల్కునుపయోగించి బట్టలు నేయబడేవి- పప్పులు, నూనెగింజలు పెద్దఎత్తున పండించబడేవి.

ఛత్తీస్‌ఘర్ సమాజం కళా, సంగీత రంగాలలో చెప్పుకోదగినసంపద కలిగిఉంది. పెళ్ళిళ్ళు, పండుగలు, తదితరఉత్సవాల సందర్భంగానూ, పున్నమిరాత్రుల్లోనూ, ఛత్తీస్‌ఘర్ ప్రజలు బృందగానాల్లో పాల్గొంటారు. ఛత్తీస్‌ఘర్ స్త్రీ పురుషులు తమ ఆనందాన్ని సువా, రిలో, బిహా, ఫాగ్ మొదలైన నృత్యాల్లో వ్యక్తీకరిస్తారు. ఛత్తీస్‌ఘర్ ప్రాంతంలో స్థానిక గ్రామదేవతలతోపాటు బుద్ధుడు, దంతేశ్వరి, కంకాలిని, మహామాయ మొదలైన దేవతలనుకూడా పూజిస్తారు. 1947 వరకూ ఈ ప్రాంతం బస్తర్, రాజనందగాం, లొహర, రాయపూర్, రతన్‌పూర్, బిలాస్‌పూర్ మొదలైన చిన్న చిన్న వేరువేరు ఫ్యూడల్ రాజులపాలనలో ఉండేది. ఈ వేరు వేరు రాజ్యాలు ప్రజా సాంస్కృతిక జీవనంలో వైవిధ్యాన్ని ఏర్పర్చాయి. ప్రభావాన్ని వేశాయి. ప్రభుత్వ పాలనా విధానంలోనే బ్రాహ్మణాధిక్య సంస్కృతి ఉండేది. గ్రామీణ సంస్కృతిలో 'బైగా'లే ప్రబలంగా ఉండేవి. ఈ ప్రాంతంలో ప్రధానంగా మాట్లాడబడే భాషలూ, మాండలికాలూ ఛత్తీస్‌ఘర్హి, హల్బి, గోండి, ఓరాన్, మరియా, పట్టణాల్లో హిందీద్వారానే సంబంధాలు కొనసాగుతాయి.

బ్రిటిష్ పాలనలో రాజనందగాంలో ఒకపత్తిమిల్లు, రాయఘర్‌లో ఒక జనపనార మిల్లు మాత్రమే ఉండేవి. స్వాతంత్ర్యానంతరం ఈ ప్రాంతంలో సోవియట్,

ఇతర విదేశీ పెట్టుబడుల సహాయంతో ఎన్నో భారీపరిశ్రమలు స్థాపించబడ్డాయి. భిలాయి ఉక్కుకర్మాగారం, కోర్బా అల్యూమినియం కర్మాగారం, థెర్మల్ విద్యుత్ ఫ్యాక్టరీలు, సిమెంట్ ఫ్యాక్టరీలు వాటిలో కొన్ని.

## ఛత్తీస్‌ఘర్ ఆర్థిక, సాంఘికస్థితి

విస్తారమైన ఖనిజనిలువలు, అడవులు, సారవంతమైన భూమి ఉన్నప్పటికీ ఛత్తీస్‌ఘర్ ప్రజలు విపరీతమైన పేదరికంలో జీవిస్తున్నారు. లక్షలాది మందికి రెండుపూటలా అన్నం దొరకడమనేదే ఒక తీరనికల. ఎక్కడపడితే అక్కడ సరైన ఆహారం లేకపోవడం, తక్కువ విద్యాసౌకర్యాలు, అనారోగ్యం కనిపిస్తాయి. ఛత్తీస్‌ఘర్ ప్రజలను ఆర్థిక, సాంఘిక దృక్కోణం నుంచి మూడు రకాలుగా విభజించవచ్చు. 1. ఆధునిక పారిశ్రామిక సముదాయాల చుట్టూ ఆవరించి అభివృద్ధి చెందిన పట్టణ ప్రాంతాలలో నివసించే ప్రజలు. 2. కొండల్లోనూ, అడవుల్లోనూ అక్కడక్కడా ఉన్న ఆదివాసుల గూడాలు. 3. మైదాన ప్రాంతాల్లో వ్యవసాయం మీద ఆధారపడ్డ ప్రజలు.

ప్రభుత్వరంగంలో విదేశీ పెట్టుబడితోనో, ప్రైవేట్ రంగంలో భారత బడా పెట్టుబడితోనో స్థాపించబడ్డ ఆధునిక భారీపారిశ్రామిక సముదాయాల చుట్టూ ఒక కొత్త రకపు పట్టణ నాగరికత వ్యాపించింది. మళ్ళీ ఈ పట్టణ ప్రాంతంలోనూ ఆధునిక సౌకర్యాలున్న ప్రాంతాలు కొన్నీ మురికివాడలు కొన్నీ ఉన్నాయి.

ఈ ప్రాంతంలోని ఆధునిక పారిశ్రామిక సముదాయాలలో ఉక్కు పరిశ్రమ ఉన్న భిలాయి, అల్యూమినియం పరిశ్రమ ఉన్న కోర్బ, సిమెంట్ పరిశ్రమ ఉన్న జమ్ముల్, అకల్‌తారా, మదార్ మొదలైనవి ఉన్నాయి. ఛత్తీస్‌ఘర్‌కు సాంస్కృతిక రాజధానిగా చెప్పబడుతున్న రాయపూర్ కూడా ఇలాంటిదే. ఈ నగరాలలో నివసిస్తున్న ప్రజల్లో 90 శాతం మంది దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన వాళ్ళుకాగా 10 శాతం మంది మాత్రమే ఛత్తీస్‌ఘర్‌కు చెందిన వాళ్ళు. మురికివాడల్లో ఛత్తీస్‌ఘర్‌కు చెందిన వాళ్ళేకాక ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర మొదలైన పొరుగు రాష్ట్రాల నుంచి వలసవచ్చిన వాళ్ళుకూడా నివసిస్తారు.

కొండల్లోనూ, అడవుల్లోనూ చెల్లాచెదురుగా ఉన్న గూడాల్లో నివసించే వాళ్ళు ప్రధానంగా ఆదివాసులే. వీళ్ళలో 10 శాతం మంది భూమిలేనివాళ్ళు, 75 శాతంమంది చిన్నరైతులు, 12 శాతం మంది మధ్యరైతులు, 3 శాతం మంది ధనికరైతులు. అయితే ఇక్కడ భూమి అంత సారవంతమైంది కాదు.

మైదానప్రాంతాల్లో కుర్మీలు, కల్వాలు, తేలీలు, ఆదివాసులు, హరిజనులు నివసిస్తారు. వీళ్ళలో 30 శాతంమంది భూమిలేనివాళ్ళు, 40 శాతం చిన్నరైతులు, 20 శాతం మధ్యరైతులు, 8 శాతం ధనికరైతులు, 2 శాతం భూస్వాములు. భూమి ఒకమాదిరి నుంచి చాలా ఎక్కువ వరకు సారవంతంగా ఉంటుంది.

వ్యాపారవర్గంలో ఎక్కువ మంది ఛత్తీస్‌ఘర్‌కు బయట నుంచి వచ్చినవాళ్ళే వడ్డీవ్యాపారంగ్రామాల్లో మార్వాడీలచేతుల్లోనూ, పట్టణాల్లో పంజాబీలచేతుల్లోనూఉంది.

ఉద్యోగాల విషయానికొస్తే ఆదివాసులు, తదితరపేదవర్గాల ప్రజలు గనుల్లో పని చేస్తాడు. కాని ఈ మధ్య కాలంలో 'సోషలిస్టు' సోవియట్ యూనియన్ సరఫరా చేస్తున్న యంత్రాలు, పెట్టుబడి ఫలితంగా గనుల్లో యంత్రాలు ప్రవేశించి ఉద్యోగావ కాశాలు తగ్గిపోతున్నాయి.

## మధ్యప్రదేశ్ ప్రస్తుతస్థితి - చిన్న రాష్ట్రాల కోసం డిమాండ్

మాల్వీ, బుందేలి, బఘేలి, ఛత్తీస్‌ఘరి జాతులను అధీనంలో ఉంచుకోవ డానికీ, పాలించడానికీ రాజ్యాంగయంత్రం సృష్టించిన అసహజ ప్రాంతం ఇవాళ్టి మధ్యప్రదేశ్. కనుకనే ప్రజాస్వామిక కార్యక్రమాలు, పాలన, వ్యవసాయాభివృద్ధి, వ్యవసాయోత్పత్తుల పంపిణీ, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి, ప్రజానీకపు శ్రమశక్తి సద్వినియోగం, శాస్త్రీయపరిజ్ఞాశిక, విద్య, ఆరోగ్య, సాంస్కృతిక రంగాలలో బహుళాభివృద్ధి మొదలైన ఎన్నో అంశాలలో ప్రస్తుతం కొనసాగుతున్న రాజ్యాంగ యంత్రపు వైఫల్యం స్పష్టంగా కనబడుతుంది. రాజ్యాంగయంత్రం అర్ధభూస్వామ్య అర్ధవలస విధానంలో అధికారం చెలాయిస్తున్నప్పుడు, భయంకర చట్టాలు అమల్లోకి తెచ్చి ప్రజానీకాన్ని భయభ్రాంతుల్ని చేయడమే దాని ఏకైక ఉద్దేశ్యంగా ఉంటుంది. కనుకనే సహజమైన రాజకీయ చర్యలద్వారా నిర్ణయించబడవలసిన రాష్ట్రాల సరి హద్దులు ఎంతో కృత్రిమంగా రాజ్యాంగయంత్ర పాలనాసౌలభ్యం కోసం నిర్ణయించ బడ్డాయి. ఈ విధంగా పాలనాసౌలభ్యం కోసమే మేఘాలయ, అరుణాచలప్రదేశ్, మణిపూర్, హర్యానా రాష్ట్రాలు సృష్టించబడ్డాయి. దీనికి విరుద్ధంగా తన పాలనా సౌలభ్యానికి సరిపడవు గనుక అదే రాజ్యాంగయంత్రం ఛత్తీస్‌ఘర్, తెలంగాణ, జార్ఖండ్ మొదలైన చిన్నరాష్ట్రాల ఏర్పాటు కోర్కెను తిరస్కరిస్తోంది. తత్ఫలితంగా ప్రజానీకం బలవంతంగా భూస్వామ్య, అర్ధభూస్వామ్య రాజకీయ వ్యవస్థలోకీ, ఉత్పత్తి విధానంలోకి నెట్టబడుతున్నది. గ్రామీణ ప్రజానీకపు కొనుగోలుశక్తి నానాటికీ

తగ్గిపోతున్నది. ప్రజలు ఒకదాని తర్వాతొకటి వరుసగా కరువులనెదుర్కోవాల్సి వస్తున్నది. ఆకలిగొన్న జనం తీవ్రమైన నిరాశలో చావుకెదురుచూస్తూ బతుకుతున్నారు. ఐనా జనమౌనాన్ని ఆసరాగా తీసుకొని ప్రభుత్వం ప్రగతి గీతాలు పాడుతోంది.

### నూతన చత్తీస్‌ఘర్ రాష్ట్రంకోసం డిమాండ్ ప్రముఖ ప్రజాస్వామిక డిమాండ్.

---

తమప్రాంతం అభివృద్ధిచెందాలని చత్తీసఘర్ ప్రజలు కోరుకుంటున్నారు. ప్రస్తుత రాజకీయ వ్యవస్థలో చిన్నరాష్ట్రాల నిర్మాణమే అకస్మాత్తుగా ప్రస్తుత సమస్యలన్నీ తీర్చివేస్తుందనే హామీ ఏమీలేదు. ఐనప్పటికీ ప్రత్యేక జాతీయ వ్యక్తిత్వం ఆధారంగా చిన్నరాష్ట్రాల నిర్మాణంవల్ల జాతివికాసానికి తాము చురుకుగా పాలుపడగలమనీ, సహజవనరులను సరిగానూ, ప్రణాళికబద్ధంగానూ ఉపయోగించుకోవచ్చుననీ జాతిలోని అధికసంఖ్యాక ప్రజలు భావించినప్పుడు, ఆ ఉమ్మడి లక్ష్యం వైపు కృషి సాగించడానికి సిద్ధంగాఉన్నప్పుడు వాళ్ళడిమాండ్ వాళ్ళ ప్రజాస్వామిక హక్కుఅవుతుంది. ఈ ప్రజాస్వామికహక్కు తప్పనిసరిగా అమలుపరచబడాలి. ఇవాళ చత్తీస్‌ఘర్‌లోని బూర్జువావర్గం, పెటీబూర్జువావర్గం ప్రత్యేక రాష్ట్రభావనకు హెచ్చుగా అంకితమవుతున్నారు, ఆసక్తి చూపుతున్నారు. రైతాంగంలోకూడా తమకొక స్వంత రాష్ట్రం కావాలన్నకోరిక బలవత్తరమవుతున్నది. కనుకనే కార్మికవర్గానికి ఈ సమస్యలో పాలుపంచుకోవాల్సిన బాధ్యతఉంది. ఈ ఉద్యమాన్ని నిర్దిష్టదిశలో నడిపించి, ప్రజావిముక్తి సమస్యలతో సమ్మిళితం చేయనట్టయితే ఇది తప్పుదారి పట్టవచ్చు. మిలిటెంట్ దురహంకారం ఈ ఉద్యమాన్ని మొత్తంగా నష్టపరుస్తుంది.

భారతదేశంలో జాతులసమస్య మొదటినుంచీ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దృష్టినుంచే చూడబడింది. 'స్వాతంత్ర్యపోరాటం'అని పిలవబడుతున్న దళారీ బూర్జువావర్గపు పరిమిత ప్రయోజనాలనూ, పెట్టుబడిదారుల పరిమిత ప్రయోజనాలనూ దాటిపోయిందనుకున్నప్పుడు సాంఘిక విముక్తికై సాగే దీర్ఘకాలిక ప్రజాపోరాటంగా మారుతుందనుకున్నప్పుడు సామ్రాజ్యవాదులు పిచ్చెత్తిపోయారు. "భరతజాతి అనేది ఒకటిఉందా? ఒక ఉపఖండంఅని పిలవదగినంతటి పెద్ద భూభాగంలో చెల్లాచెదురుగా జీవిస్తూ, జాతి, భాష, సంఘం, సంస్కృతి మొదలైన ఎన్నో అడ్డుగోడలతో విభజించబడ్డ వాళ్ళందరూ ఒకేజాతిగా ఏకంకాగలరా? భారతదేశపు ఐక్యత బ్రిటిష్ పాలకులు కృత్రిమంగారుద్దిన అబద్ధపు ఐక్యతేననేది నిజంకాదా?"అని వాళ్ళు ప్రశ్నించారు "భారతదేశం అనేదేదీలేదు, ఉండబోదుకూడా"అని 1888లో సర్ జాన్ స్ట్రాచీ గంభీరంగా ప్రకటించాడు. [భారతదేశం : దాని పాలనాప్రగతి,]

"భారతజాతి అనేభావన రాజనీతిశాస్త్రం పారదోలడానికి యత్నించే ఒకానొక దురభిప్రాయంపై ఆధారపడిందే. భారతదేశం అనేపేరు ఏ రాజకీయ వాస్తవానికి సంబంధించిందీకాదు. కాని యూరప్, ఆఫ్రికాల లాగా అదికూడా ఒక భౌగోళిక అర్థంలో వాడబడుతున్నది. అది ఏఒక్క జాతి లేదా భాషాబృందంతో ఏర్పడింది కాదు. ఎన్నో జాతులతోనూ, భాషాబృందాలతోనూ నిండినది"అని జాన్‌సీలే అన్నాడు.

1930లో సైమన్ కమీషన్ నివేదికలు ప్రజల భిన్నత్వాన్ని వివరించి, దాని ఆధారంగా భారత స్వాతంత్ర్య పోరాట ప్రాథమిక అంశాలకు సంబంధించి కొన్ని సందేహాలు లేవనెత్తాయి. ఈ నివేదికలు జాతీయోద్యమం గురించి "భారతదేశంలోని అసంఖ్యాక జనాభాపై ఒక అల్పసంఖ్యాకవర్గం ఇష్టాలు ప్రభావం వేస్తున్నాయి" అని రాశాయి. ఈ 'అసంఖ్యాక జనాభా' అనేదానికి 222 భాషలు, హిందూముస్లిం ప్రయోజనాల వ్యతిరేకతా కలిగిన ఎన్నోజాతుల మతాల సమ్మేళనంగా అర్థంచెప్పారు. ఇంగ్లీషు వాళ్ళు వదిలివెళ్ళిపోతే చావుకేకలతోనూ, హత్యల అరుపులతోనూ, ఇతర గందరగోళంతోనూ భారతదేశం నిండిపోతుందని చర్చిల్ ప్రకటించాడు. వివిధజాతుల అస్తిత్వం ఆధారంగానే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారత స్వాతంత్ర్య పోరాటాన్ని వ్యతిరేకించారు. దీనికి సమాధానంగా మన బూర్జువానాయకులు ఆవేశపూరిత, ఆదర్శవాద ఐక్యతను నొక్కిచెప్పారు. "భిన్నత్వంలో గొప్పఐక్యత"అని టాగోర్ ప్రశంసించాడు. అన్నిజాతులూ ఒకే వ్యక్తిత్వంలో ఏకమయ్యాయని ప్రకటించాడు. సామ్రాజ్యవాదుల ప్రకటనతో సురేంద్రనాథ్ బెనర్జీ, మోతీలాల్‌నెహ్రూలాంటి కొందరు బూర్జువా నాయకులుకూడా ప్రభావితులయ్యారు.

ఈ సమయంలో భారతజాతిలోని విభిన్న సాంస్కృతిక వ్యక్తిత్వాల మధ్య అంతర్లీనంగా ఉన్న ఐక్యతాభావనకు బూర్జువా నాయకులు శాస్త్రీయ దృక్పథం ఇవ్వలేకపోయారు. లేదా బహుశా ఆ దృక్పథం ఉద్దేశ్యపూర్వకంగానే అణచివేయబడింది. 1921 జనాభా లెక్కల ఆధారంగా కొందరు కమ్యూనిస్టులు జాతీయ ఐక్యతకు వర్గ ప్రయోజనమే నిజమైన పునాది అని నొక్కిచెప్పారు. ఉదాహరణగా వాళ్ళు జంషెడ్‌పూర్‌ను చూపారు. అక్కడ ఆధునిక పద్ధతుల్లో ఉత్పత్తి సాగుతున్నచోట ఎన్నో జాతుల, తెగల ప్రజలుకలిసి పనిచేస్తున్నప్పటికీ తమతోపాటు పనిచేస్తున్నవాళ్ళతో జాతిపరమైన ఘర్షణనెప్పుడూ ఎదుర్కోలేదు. అయితే కమ్యూనిస్టులు వర్గకోణం మాత్రమేచూసి భారతదేశంలో ప్రబలంగాఉన్న వ్యావసాయిక ఆర్థికవ్యవస్థనూ, భారత రైతాంగ చైతన్యస్వభావాన్నీ నిర్లక్ష్యంచేశారు. జంషెడ్‌పూర్‌కు వర్గకోణం

సరిపోయినట్లయితే దక్షిణ బీహార్ గిరిజనులకు జార్ఖండ్ సమస్య ముఖ్యమైనదే అవుతుంది. అయితే ఈమధ్యే జరిగిన మతకల్లోలాలకు అదే జంషెడ్‌పూర్ రంగంకావడం ఈ సందర్భంలో విచిత్రమైన విషయం.

## ఇప్పటికికూడా రాజ్యాంగయంత్రం చర్చిల్ మాటలనే వల్లిస్తున్నది.

సుస్థిరప్రభుత్వంఅనే ఎండమావినిచూపి ప్రజలను దారితప్పించడం, దానికి ప్రత్యామ్నాయంగా ప్రజలముందు అస్థిరతను సృష్టించడం సరిగ్గా సైమన్ కమీషన్ ముగింపు ప్రతిపాదనలనే ప్రతిబింబిస్తున్నాయి. కేంద్ర అధికారానికి మద్దతునివ్వమనే విజ్ఞప్తి సామ్రాజ్యవాదుల ఉపసంహరణవల్ల చావుకేకలు వినిపిస్తాయని చర్చిల్‌చేసిన బెదిరింపును గుర్తుకుతెస్తున్నది. ఇప్పటికికూడా భారతఐక్యతఅనేది కేంద్రంరుద్దిన కృత్రిమ నిర్మాణమేనా ? కేంద్రంలో చిన్న మెత్తం బలహీనతదేశం పరస్పరం కొట్లాడుకునే చిన్నచిన్న ముక్కలుకావడానికి దారితీస్తుందా ? టాగోర్‌చెప్పిన భిన్నత్వంలో ఏకత్వం ఎక్కడ ? రాష్ట్రాలకు ఎక్కువ స్వాతంత్ర్యాన్నికోరుతూ అప్పుడప్పుడు బలహీనమైన కేకలువినబడతాయి. ఈ కేకలు వెలువడడానికికూడా ఏ బలమైన వాదనా దన్నుగాఉండదు. నిజమైన సమస్యలన్నీ తెలివిగా అస్పష్టం చేయబడతాయి. జాతీయ సమైక్యతా సమస్యవిషయంలో ప్రతిఒక్కళ్ళూ సైమన్ కమీషన్‌నే ఎందుకు అనుసరిస్తున్నారు ? విభిన్నజాతుల అస్తిత్వాన్ని ఎందుకు గుర్తించగూడదు ? జాతీయ వ్యక్తిత్వానికే ప్రాధాన్యతనిచ్చి దానికి విధేయమైన శక్తులను భూస్వామ్య, వలస విధానంలాంటి పెద్దసమస్యలవైపు ఎందుకు మళ్ళించగూడదు.

భారత ప్రజలలోని విభిన్నజాతులు విస్తారమైన భూభాగంలో విభిన్నప్రాంతాల్లో నివసిస్తాయి జాతీయ, చారిత్రిక కారణాలఫలితంగా ఈ జాతుల బృందాల అభివృద్ధిలో అసమానతలు ఏర్పడ్డాయి. కొన్ని జాతిబృందాల ప్రజలు ఆర్థికంగా, సాంఘికంగా ఎంతో అభివృద్ధి సాధించిఉండగా, మరికొన్ని జాతిబృందాల ప్రజలు అన్ని రంగాలలోనూ వెనుకబడిఉన్నారు. ఈ బృందాల్లోకూడా హరిజనుల, అదివాసుల పరిస్థితి బృందంలోని సగటు మనిషికంటె వెనుకబడేఉంది, చత్తీస్‌ఘర్ ప్రాంతంలో ఆదివాసులు, హరిజనులు మొత్తంజనాభాలో 60 నుంచి 65 శాతం ఆక్రమిస్తారు. ఈ కారణాలవల్ల ఇంతకుముందేచెప్పినట్లు చత్తీస్‌ఘర్ మొత్తంమీద విపరీతంగా వెనుకబడివున్న ప్రాంతమని వెల్లడవుతుంది.

## చత్తీస్‌ఘర్ ప్రజలకు తమమతాము పాలించుకునే హక్కుఇవ్వాలి

ప్రతిజాతిబృందానికీ తన ప్రజానీకం కోరికమీదనే తనభవిష్యత్తు నిర్మించుకునే హక్కుఉండాలని స్టాలిన్ బోధించారు.

చత్తీస్‌ఘర్‌లో సమీపభవిష్యత్తులోనే జాతిబృందాలు తమనుతాము పాలించుకునే హక్కుకోసం పోరాటం ప్రారంభిస్తాయి. ఎందువల్లనంటే చత్తీస్‌ఘర్‌లో అసంఖ్యాక జనాభా వ్యవసాయంమీద ఆధారపడిఉంది. రైతాంగం, ముఖ్యంగా ఆదివాసి రైతాంగం అణచివేయబడుతున్నది, దోపిడీ చేయబడుతున్నది. భూమిసమస్య జాతిసమస్యతో దగ్గరిసంబంధం కలిగిఉంది గనుక ఈ ఉద్యమంతో రైతాంగం తమ శక్తులన్నిటినీ ఉపయోగించి యుద్ధంలో పాల్గొంటారు. ఈ ఊహ గత చారిత్రిక అనుభవాలను గణనలోకి తీసుకొని చేసిందే. కనుకనే కార్మికవర్గం కూడా తమ సహాయ సహకారాలందిస్తూ ఈ యుద్ధంలో పాల్గొంటుంది. రైతాంగపు కొనుగోలు శక్తి పెరగడమనే తన ప్రయోజనం దృష్ట్యా జాతీయ బూర్జువావర్గమూ, పెటీబూర్జువా వర్గమూ ఈ ఉద్యమంలో భాగంపంచుకుంటాయి. లేదా కనీసం ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించవు.

ఎన్నో పోరాటాలు విజయవంతంగా నడిపిన అనుభవమున్న చత్తీస్‌ఘర్ కార్మికవర్గం ఈ ఉద్యమానికి నాయకత్వం వహించగల స్థితిలోనే ఉంది. మా ఎరుపు ఆకుపచ్చజెండా ఆదివాసి రైతాంగంలో ఎంతగానో అభిమానించబడుతున్నది గనుకనే ఈ నాయకత్వానికి బలంచేకూరుతున్నది.

ఈ సందర్భంలో ఆనందమార్గీయులు, జమీందార్లు "చత్తీస్‌ఘర్ చత్తీస్‌ఘర్ ప్రజలదే" అని లేవదీసిన నినాదం ప్రజల్లో ఏ ప్రభావమూ చూపలేదు. ఈ ఉద్యమంలో ఖచ్చితంగా ఒక జాతిబృందం ఇంకో జాతిబృందానికి వ్యతిరేకంగా పోరాడదు.

విభిన్నవర్గాల ప్రజలు తమ తమ వర్గప్రయోజనాల ఆధారంగా, వర్గచైతన్యం ఆధారంగా ఏకమవుతారు. కనుకనే వివిధ బృందాల ప్రయోజనాలు సాధించే ఉద్యమ క్రమంలో ఆ బృందాల మధ్య శాంతి దృఢంగా ఉంటుంది.

ఈ ఉద్యమం ఎన్నో కార్యక్రమాల కలయిక. విప్లవకర ట్రేడ్‌యూనియన్ కార్యక్రమాలు, మద్యపాన బహిష్కరణ, రైతుసమస్యలు, భూమి సమస్య, అటవీ ఉత్పత్తుల ధరల సమస్య, విద్య, ఆరోగ్య సేవల సమస్య, ప్రతి అణచివేతకు వ్యతిరేకంగా పోరాటాలు, ప్రత్యేకంగా స్త్రీలపై అణచివేతకు వ్యతిరేకంగా పోరాటాలు వాటిలో కొన్ని. ఈ పోరాటాలు తన ప్రయోజనాలు కాపాడేవేనని గుర్తించిన తరువాత కార్మికవర్గం ఉద్యమంలో పాల్గొనడమే కాకుండా నిస్వార్థంగా నాయకత్వబాధ్యతను కూడా స్వీకరిస్తుంది.

ఇవాళ ఛత్తీస్‌ఘర్ వెనుకబాటుతనానికి కారణాలు

1. వలసవాదులు అకస్మాత్తుగా అమల్లోకితెచ్చిన ఉన్నతస్థాయి ఆర్థిక సంబంధాలు, యాంత్రికీకరణ
2. గ్రామీణ ఫ్యూడల్ ఆర్థికవ్యవస్థ
3. తక్కువ ఉత్పాదకతగల భూమి

ఈ మూడు సమస్యలూ భూస్వామ్యవిధానపు సమస్యలే.

మనం భూస్వామ్య విధానంనుంచి సామ్యవాదానికి ఒక్కసారే గంతువెయ్యలేం పెట్టుబడిదారీ విధానాన్ని దాటుతూ సోషలిజానికి పరివర్తనచెందే చర్యనుమాత్రమే మనం ప్రారంభించగలం. ఐతే చరిత్రనేర్పిన పాఠాలను దృష్టిలోపెట్టుకొని కార్మిక వర్గ నాయకత్వంలో గ్రామీణప్రాంతాల్లో ఈ చర్యను కొనసాగించేటప్పుడు ఎంతో జాగ్రత్త తీసుకోవాలి.

కార్మికవర్గం అక్కడితో ఆగకుండా సహకార సంఘాలుస్థాపించడంలాంటి మరో ముందడుగువేస్తుంది. [ఈ సంఘాలు ప్రస్తుతసంఘాల పద్ధతిలో ఉండవు]. ఇలాంటి ఇతర సంఘాలు సామ్యవాద ఆర్థికవ్యవస్థవైపు, సామ్యవాద సమాజంవైపు పురోగమనానికి దారితీస్తాయి.

జాతి వ్యక్తిత్వానికై ప్రస్తుతం జరుగుతున్న ఉద్యమంలో శ్రామికవర్గం తన మిత్రులను కనుకొని వారితో ఏకమై శత్రువులతో పోరాడుతుంది,

ఉద్యమం మిలిటెంట్ దురహంకారానికి ఎరఅయిపోయే ప్రమాదాన్ని నిరోధించడానికిగాను మొట్టమొదట మనం 'ఛత్తీస్‌ఘరీ అంటేఎవరు?'అని ప్రశ్నించుకోవాలి. వచ్చేజవాబును మనం ఉద్యమమంతటా గుర్తుంచుకోవాలి. ఛత్తీస్‌ఘరీ అంటే ఛత్తీస్‌ఘర్ భౌగోళికప్రాంతంలో నివసిస్తూ గౌరవనీయమైన శ్రమపై ఆధారపడి జీవనం గడుపుతున్నవాళ్ళు; ఛత్తీస్‌ఘర్ ప్రజానీకపు స్వాతంత్ర్యం సాధించడానికై తమ బతుకులు అంకితంచేయడానికి సిద్ధపడేవాళ్ళు; ఆర్థికంగానూ, ఏ ఇతర రూపంలోనూ భూస్వామ్యవర్గాలను అనుసరించనివాళ్ళు; పెట్టుబడిదారీ సంబంధాల అంతం కోరుకునేవాళ్ళు; ప్రజాస్వామిక ఛత్తస్‌ఘర్ అభివృద్ధిని అడ్డుకోనివాళ్ళు; ప్రపంచ శ్రామికులపట్ల సోదరభావం ప్రకటించేవాళ్ళు.

శ్రామికవర్గ విముక్తికి విప్లవమే సంపూర్ణ చారిత్రిక అవసరం. ఇతర అభ్యుదయకర వర్గాలకు విప్లవమంటే సాంఘిక ధర్మంలో గుణాత్మక పరిణామాన్ని

సాధించే ఒకఅవసరం. జాతుల స్వయంనిర్ణయాధికారంకోసం పోరాటం ఈ గుణాత్మక పరిణామదిశలో ఒకఅడుగు.

## ఛత్తీస్‌ఘర్‌లో మేం ఎలా పనిచేస్తున్నాం?

మేం ప్రస్తుత సాంఘికవ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటంలో నిమగ్నమయ్యాం. ఈ వ్యవస్థలో మేం గుణాత్మకపరిణామాన్ని సాధించదలచుకున్నాం. ఐతే ప్రత్యామ్నాయం గురించి మా ఆలోచనేమిటి? 'ప్రత్యామ్నాయపు భౌతికవాస్తవికతను తర్వాత గమనించవచ్చుగాని ముందు నా ఉపన్యాసంవిను' అని కొందరు కామ్రేడ్స్ అనవచ్చు. కాని మేమట్లాఅనం. మన క్రియాశీల కార్యక్రమాల ద్వారానే మనం మన లక్ష్యాన్ని సాధించగలమని మేం అనుకుంటున్నాం. ఈ కారణంవల్లనే మా కార్యక్రమంలోకి ఒక్కొక్కళ్ళను కలుపుకొచ్చే సందర్భంలోనే మేం ప్రత్యామ్నాయం కోసం పరిశోధిస్తున్నాం. ప్రస్తుత సాంఘిక వ్యవస్థకు ప్రత్యామ్నాయం ప్రజల ప్రజాస్వామిక విప్లవక్రమంలో సాధించబడి, ప్రజానాయకత్వంలో ఉండే వ్యవస్థ. జాతి వ్యక్తిత్వం కోసమై జరిగేపోరాటం ఈ కృషిలో కలుపుకురాగల ప్రగతిశీల వర్గాలను గుర్తించడానికీ, ఐక్యంకావడానికీ తోడ్పడుతుంది. ఈ చర్యలో నిజమైన సామ్యవాదవ్యవస్థ సాధన తర్వాతి అడుగు అవుతుంది.

---

# పుస్తక స్వీకారం

1. మంచి ముత్యాలు - కథలు- అల్లం శేషగిరిరావు, మిత్రసాహితి, విశాఖపట్నం ప్రచురణ (మే 1980), పేజీలు : 208 + 2 వెల రు. 8.00 ప్రతులకు : న్యూస్టూడెంట్ బుక్ సెంటర్, విజయవాడ 520 002.
2. దిక్సూచి- 2 సాహిత్యకరపత్రిక సెప్టెంబర్ / అక్టోబర్ 1981 నిర్వహణ : సాహితీమిత్రులు, సిరిసిల్ల, పేజీలు : 8 వెల : లేదు ప్రతులకు : దిక్సూచి, 1-2-63, సిరిసిల్ల, కరీంనగర్ 505201
3. స్పార్టకస్ - హోవర్డ్‌ఫాస్ట్, అనువాదం : ఆకెళ్ళకృష్ణమూర్తి, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ (1981), పేజీలు : 376 + viii, వెల. సాదాప్రతి రు. 13-50, మేలుప్రతి రు. 20-00, ప్రతులకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 500 029
4. మరోవెలుగు : ఆధునిక సాహిత్యకరపత్రిక. ఎడిటర్ వెంపలి వెంకటశివప్రసాద్, పేజీలు : 8 వెల లేదు, ప్రతులకు :
5. ఎక్సరే - ఆధునిక కవితావేదిక, (నవంబర్ 1981), ఎడిటర్ : కొల్లూరి, పేజీలు : 8 వెల : 25 పై. ప్రతులకు : ఎక్స్-రే, కొల్లూరిహౌస్, అమలాపురం 533 202

# భూచింతనం

నందిని సిధారెడ్డి

భూమి పెద్ద అయస్కాంతం !
రాలేమేఘాన్ని ఆకర్షిస్తుంది
కన్ను ఇముడ్చుకోలేని బాధని ఆకర్షిస్తుంది
సమస్త కాలాల రాజకీయ చరిత్రను ఆకర్షిస్తుంది

భూమి గొప్ప శ్రమజీవి
వేళ్ళమీద పొలాల్నీ ఫ్యాక్టరీల్నీ మోస్తుంది
రేఖలమధ్య దేశాల్ని మోస్తుంది
ఆవిర్లు కక్కుతూ అనవరతం సంవత్సరాలు ప్రయాణంచేస్తుంది

భూమి మహామేధావి !
పొరలు పొరలుగా అనుభవాలు విప్పుతుంది
విత్తుకి జన్మనిచ్చి
పాఠాలుచెప్పి
పచ్చటి పక్షులిచ్చి విశాలంచేస్తుంది
బిందువుకి ఉపదేశంచేసి
ప్రవాహగుణంతో
జీవనాటవులమధ్య తిప్పి
సముద్రమంత గ్రంథం రాయిస్తుంది

భూమి స్వచ్ఛమైన కామ్రేడ్ !
వెసువియస్‌ల్ని నేర్పుతుంది
కాల్పులకి కమిలిపోయిన కనుగుడ్లను ఒడిలో దాసుకుంటుంది
చీల్చుకొచ్చే సూర్యుడికి
లాల్‌సలామ్ చెప్పటానికి చెట్లచేతుల్లో ఎర్రపూలు పట్టు కొస్తుంది.

# ఖబడ్దార్

సత్యనారాయణ బానూరి

ఖబడ్దారు ఖబడ్దారు - ఓ దోపిడి నేతలారా
ఖబడ్దారు ఖబడ్దారు - నరభక్షక ప్రేతలారా
కదిలిందీ కూలిదండు - ఆకలిఅరుపులదండు

బావులనేతవ్వినాము - బంజర్లే దున్నినాము
నెత్తురునే బురదచేసి - విత్తనాలు చల్లినాము
ఫలితం మీదవుతుంటే - తలరాతనుకున్నాము
మారాత మీరెరాశారని - తెలిసినేడు ఉరికాము ॥ఖబ॥

ఆకలిచావులుమావి - అరగనిత్రేపులుమీవి
మేడలుమిద్దెలుమీవి - గుడిసెలుమాత్రంమావి
మాకండలు పిండిపీల్చి - కులుకుటఇంకెన్నాళ్లు
మేమంతా కలిశాము - తాడితులం పీడితులం ॥ఖబ॥

కులంపేర మతంపేర - కుటిల రాజనీతిపేర
శ్రమజీవుల సమాధిపై - దోపిడి కోటలుకట్టి
యుగయుగాలుగామమ్ము . బానిసలుగ బ్రతకమని
శాసనాలుచేసినారు - చరిత్రలో ఎదిగినారు ॥ఖబ॥

కంకరకొట్టింది మేము - కత్తులుపట్టింది మేము
రాణివాస మందిరాలు - కట్టినకూలీలు మేము
రాజుల రాజ్యాలునిలుప - ప్రాణాలొడ్డింది మేము
చెరగలేదు చరిత్రలో - ఆనెత్తుటిమరకలింక ॥ఖబ॥

నింగిమాది నేలమాది - గాలినీరు మాదిమాది
కట్టిన ఆగుడ్డమాది - బ్రతికే మీ బ్రతుకుమాది
మేమంతా ఒక్కసారి - కళ్ళుతెరిచి చూశామా
చూపుల సుడిగాల్పులోన - రెల్లుగడ్డి అవుతారు ॥ఖబ॥

తూర్పుదిక్కు కొండల్లో - మంటలు మిన్నంటుతుంటే
ఎఱ్ఱెఱ్ఱని గాలితుఫానులు - ఉధృతమై వీస్తుంటే

# సంకెళ్లు తెంచుకోండి (నాటిక)

కె. రాంమోహన్‌రాజు

## పాత్రలు :

(మొత్తం 15 మంది అవసరం. వయస్సువీలునుబట్టి ఏర్పాటు చేసుకోవాలి)

1. రవి - యూనివర్సిటీ విద్యార్థి - విద్యార్థివేషం - కళ్ళద్దాలు.
2. రాజయ్య - కార్మికుడు
3. వీరయ్య - కార్మికుడు
4. సుదర్శనం - కార్మికుడు
5. నారాయణ - కార్మికుడు
6. ఇంకా ఇద్దరుకార్మికులు.
7. శంకర్రావు - ట్రేడ్ యూనియన్ లీడరు
8. యాకోబ్ - శంకర్రావుతొత్తు. కార్మికుడు
9. ఇద్దరు లేదా ముగ్గురు గూండాలు
10. యుస్వయి
11. ఇద్దరు పోలీసులు

## 1వ రంగం

[ట్రేడ్ యూనియన్ నాయకుడు శంకర్రావు ప్రవేశిస్తున్నాడు, లాల్చీ, పైజమా వేసుకున్నాడు. కళ్ళకి అద్దాలు. కిళ్ళీనములుతూ, సిగరెట్ కాలుస్తున్నాడు. యాకోబ్ అనే కార్మికుడు ఎదురవుతున్నాడు ]

యాకో : నమస్కారమండీ శంకర్రావుగారు !

శంక : (విలాసంగా) ఏరా ! యాకోబ్ ! ఎలావుంది ఫాక్టరీ పరిస్థితి ?

---

గడ్డిపరకలన్నినేడు - గడ్డపలుగులై నిలిచె
ఎండిన ఎముకలగూళ్ళె - ఎదిరిజబ్బ చరిచెచూడు ॥ఖబ॥

ప్రజలఓటుతోడగెలిచి - ప్రజలను పీడించుకుంటు
ఉద్యమాలఉరితీస్తు - వీరులనతమార్చుకుంటు
అధికారం చెలాయిస్తే - అనిగిమేము పడివుండం
ఢిల్లీసింహాసనాన్ని - తలకిందులు చేసేస్తం ॥ఖబ॥

కాకీబట్టల (కుక్కల) బలగం - కలదుమీకుఅనుకుంటే
తరతరాలదోపిడిలో - నలిగిన మా జాతంతా

కలుస్తుంది నిలుస్తుంది - పోరుబరినదూకుతుంది
నెత్తుటుకారేవెట్టని - గుండెల జెండెత్తుతుంది ॥ఖబ॥

యాకో : మీరు ఆ రెన్నెల్ల నుంచి ఇటు రావడమేలేదాయె. పరిస్థితులు కొంచెం మారినట్టే కన్పిస్తూంది. ఈమధ్య రాజన్న, వీరిగాడు మళ్ళీ తోక ఝాడిస్తున్నారు. మొన్న కాంటీన్లో నాతో దెబ్బలాడేదాకవచ్చింది. మీరేమో ఎలక్షన్లోగెలిచి లీడరైనకాణ్ణుంచి ఇటురాకనేపోతిరి.

శంక : (సిగరెట్‌పీల్చి) ఆహా! అందాకావచ్చిందా? మేనేజర్‌గారు అర్జంటుగా రమ్మని కబురంపితే ఎందుకోఅనుకున్నా ఇందుకేనా ఏమిటి? కార్మికులు మళ్ళీ సమ్మెచేద్దామనిగాని అనుకోవడంలేదుగదా?

యాకో : అబ్బే. ఇప్పటిదాకా అలాంటిదేంలేదండి. ఇకముందు అనుకుంటేఅనుకోవచ్చు.

శంక : వీరయ్య ఎలావున్నాడ్రా? ఏమైనామారాడా లేక అలాగేవున్నాడా?

యాకో : ఏంమారలేదండి. వీడికితోడు మరో ఇద్దరు ముగ్గురు తయారయ్యారు. అంతాకలిసి ఆ గోడలమీద రాతలూ, పోస్టర్లూ, కరపత్రాలు ఒకహంగామా కాదండి.

శంక : అయితే వీడికింకా బుద్ధిరాలేదన్నమాట. సరే వీళ్ళసంగతితేలుస్తా.

యాకో : ఇంకోవిషయమండీ! ఈమధ్య వారంరోజులకింద వాళ్లు ఒకమీటింగు పెట్టారు. దాన్లో ఎవరోస్టూడెంటు కుర్రాడుగూడా మాట్లాడాడండి. నేను వెనకకూచుని విన్నాను. యూనియన్‌లీడర్లు లుచ్చాలు, దొంగలుఅంటూ ఏదేదోకూశారండి.

శంక : ఏమిటీ! అంతమాటన్నారా?

యాకో : అంతేకాదు. లీడర్ల అంతుతేల్చాలనిగూడా అనుకున్నారండి.

శంక : (కోపంగా సిగరెట్‌పారేసి) అంతుతేలుస్తారా? సరే, నాముందరా వీళ్ళ కుప్పిగంతులూ, బోడిమీటింగులూ. ఒరే యాకోబ్ నాసంగతి నీకుతెలుసురా?

యాకో : తెలియకేమండి? మీరుఏదన్నా తల్చుకోవాలేగాని చిటికలోచేస్తారు.

శంక : అంతేకాదు. మన జిల్లాజడ్జీగారూ నేనూ రోజూసాయంత్రం క్లబ్బులో చీట్లపేకాడేదీ నీకుతెల్సుగా.

యాకో : (తెలుసునన్నట్టు తలాడిస్తాడు) ఇంతేనా? ఇంకా తమరూ టౌన్‌యస్.యి గారూ కూచుని మందుకొట్టేదీ, ఏ లేబరాఫీసర్లతోనూ, మేనేజర్లతోనూ ఎంత చనువుందీ, మన ఎమ్మెల్యేగారితో ఎంత స్నేహంవుందీ అన్నీనాకు తెలుసండి

శంక : ఇంత పలుకుబడి వుండే నన్ను వీళ్లేంచేస్తారా? నాఅంతు వీళ్లేంతేలుస్తారా?

యాకో : ఏమాత్రం తేల్చలేరండి. కాని మిమ్మల్ని బాగా అప్రతిష్టపాలు చేస్తున్నారండి.

శంక : ఏమిటది ?

యాకో : ఏముందండీ ! మీరు లీడర్ కాకముందు ఎలా వుండేవారో, లీడరైంతర్వాత ఎన్ని ఆస్తులు సంపాదించారో, ఎక్కడ బంగళాలుకట్టారో, మీకు పెళ్ళాం గాక ఎంత మంది ఆడాళ్లున్నారో అన్నీ ఆనాడు మీటింగ్‌లో ఏకిపారేశారండి ఎవడోగాని వాడు కళ్ళతో చూసినట్టే వర్ణించాడండి.

శంక: ఈ గాడిద కొడుకులు ఇంతకు తెగించారా ? వీళ్ళని ఇక వదిలిపెట్టగూడదు. ఒరేయ్! నువ్వు వీళ్ళతో ఇలాగే కలిసిమెలిసి తిరుగుతూ నాకెప్పటి విషయాలు అప్పుడు చెబుతూండు.

యాకో : నన్ను వీళ్ళసలు నమ్మడంలేదండి- నేను మీ తాలూకు మనిషినని వాళ్ళకి తెలిసిపోయింది.

శంక : మరేం ఫరవాలేదు లేరా ! ఏమన్నా జరిగితే నాతో చెప్పు నేంజూసుకుంటా సంగతి. (పక్కకి చూసి) ఎవరదీ ! మన టౌన్ యస్సయి లాగున్నాడే !

(యస్సయి ప్రవేశం- చేతిలో లాఠీ)

శంక : (నమస్కారంచేస్తూ) ఏమిటండీ ! మా ఫాక్టరీలో ఏమన్నా పనిబడిందా ? ఇలా దయచేశారు !

యస్సయి: అలగా వెధవలు ఉన్నచోటికి రాకతప్పుతుందా ? (యాకోబ్‌ని చూసి) వీడెవడు ?

శంక : మనవాడేలెండి. ఇంతకీ ఏం పనిమీద వచ్చారు ?

యస్సయి: మీ వెధవలకి అసలు బుద్ధిలేదు. (చేతిలో లాఠీ ఊపుతూ) నాలుగు తగల్నిస్తేగానీ దారికిరారు.

శంక : ఏం జరిగిందంటే చెప్పరేమండీ !

యస్సయి: కార్మికుల్లో ఎవరో నక్సలైటుగాళ్ళ పోస్టర్లని గోడలమీద అంటిస్తున్నారట. గోడలమీదరాతలూ, కరపత్రాలూ, మీటింగులూపెట్టి అల్లరిచేస్తున్నారట. మేనేజరు గారు రిపోర్టిస్తే సంగతి చూద్దామని వచ్చాను.

శంక : మీదాకా వచ్చిందా వ్యవహారం ? సరే వాళ్లెవరో నాకు తెలుసులెండి.

యస్సయి: ఇంకేం మంచిదే. ముందు మేనేజరు దగ్గర కెళదాం రండి.

## 2వ రంగం

[రాత్రి దృశ్యం : వయోజన పాఠశాల. ఒక మూలగా నల్లబల్లవుంది. దాని మీద "బలవంతమైన సర్పము చలిచీమలచేత చిక్కి చావదెసుమతీ!" అని రాసి వుంటుంది. తెర లేచేసరికి రవి ఉపన్యసిస్తున్నాడు ]

రవి : .... కాబట్టి మానవచరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్ర- చరిత్రలో శ్రామికుల కన్నీటితో, చెమటతో తడవని రోజు ఒక్కటైనాలేదు. అందువల్ల ఈ సంపదలన్నిటికీ మూలం శ్రామికుడు. సృష్టికర్త శ్రామికుడు- కానీ దాన్ని అనుభవిస్తున్నది మాత్రం కొద్దిమంది దోపిడీదార్లు. ఏమాత్రం ఒళ్లు అలిసిపోకుండా గుడ్డలునలగకుండా వుండేవాళ్ళే ఈ సంపదలన్నీ అనుభవిస్తున్నారు వాటినిసృష్టించిన కోట్లాదిమంది శ్రామికులు కన్నీళ్ళలో మగ్గుతున్నారు. ఈ పరిస్థితి మార్చడానికే మనం ప్రయత్నిస్తున్నాం. మనం ఈ సంపదలన్నింటికీ హక్కుదార్లుగా ప్రకటించుకునేరోజు ఎంతోదూరంలేదు. ఈ భూములు, ఫాక్టరీలుఅన్నీ మనం స్వాధీనం చేసుకుంటాం, ఈ వ్యవస్థని విప్లవంద్వారా సమూలంగా నాశనంచేస్తాం....

(యస్సయి నలుగురు పోలీసులతో ప్రవేశిస్తున్నాడు)

యస్సయి: (దర్పంగా) ఏయ్ !.... ఏంజరుగుతోందిక్కడ ? మీరంతా ఏంచేస్తున్నారు?

రవి : (తొణక్కుండా) ఇది వయోజన పాఠశాల. నేనువీళ్ళకి పాఠాలు చెబుతున్నాను. (కార్మికులు లేచినిలబడుతున్నారు)

యస్సయి: నువ్వెవరివి ? కార్మికుడిలాలేవే ! నీపేరేమిటి ?

రవి : నాపేరు రవి

యస్సయి: ఏంచేస్తుంటావునువ్వు ? (కొందరుకార్మికులు బయటికి జారుకున్నారు)

రవి : యూనివర్సిటీ విద్యార్థిని.

యస్సయి: ఓహో.... స్టూడెంటువా ? ఇక్కడ నీకేంపని ?

రవి : ఈ కార్మికులకి చదువు నేర్పుతున్నాను. ఇంతకీ మీరెందుకు వచ్చారు ?

యస్సయి: (లాఠీవూపుతూ) మీమీద రిపోర్టువచ్చింది. ఇక్కడ సంఘవిద్రోహక కార్యకలాపాలు జరుగుతున్నట్టు మాకుతెలిసింది.

రవి : చూశారుగదా ! ఇదికేవలం పాఠశాల. ఇక్కడ అలాంటివేమీలేవు.

యస్పయి: ఆఁ....(చుట్టూచూస్తున్నాడు) చూస్తే అలాగేవుంది. కానీ నేనువచ్చేసరికి నువ్వేదో విప్లవం, వ్యవస్థ అంటున్నావే! అదికూడా నీచదువులో భాగమేనా?

రవి: అవును

యస్పయి: అంటే నువ్వు విప్లవాన్ని బోధిస్తున్నావా? నక్సలైటువన్నమాట!

రవి: నిజంచెప్పేవాళ్ళంతా నక్సలైట్లేనా?

యస్పయి: (పరీక్షగాచూస్తూ) మాటకిమాట జవాబిస్తున్నావే. అంటే నువ్వునిజంగా నక్సలైటువేనన్నమాట.

రవి: ఇంతకీ మామీద రిపోర్టిచ్చిందెవరు?

యస్పయి: అదినీకు చెప్పాలా? ప్రజాసంక్షేమం కోరేవారు ఎవరైనా ఇవ్వవచ్చు. నీమీద ఇచ్చినరిపోర్టు కరెక్టేనని నాకిప్పుడు తోస్తోంది. కానిస్టేబుల్స్! గది సోదాచేయండి.

రవి: ఆగండి. సెర్చి వారంటుందా మీదగ్గర?

యస్పయి: (నవ్వుతూ) వారంటు కావాలా? నీకు?

రవి: (కోపంతో) మర్యాదగా మాట్లాడండి

యస్పయి: (హేళనగా) మర్యాదా! పోలీసులదగ్గర మర్యాద ఎవడికి దొరుకుతుందిరా? నక్సలైటువెధవ్వి నీకు మర్యాదెక్కడిదిరా? ఊఁ....వెతకండి (హుంకరిస్తున్నాడు కానిస్టేబుల్స్ వెతుకుతున్నారు)

రవి: (అడ్డంగాపోయి) మీరు అతిగా ప్రవర్తిస్తున్నారు.

(యస్పయి రవిని మూలకి తోసేశాడు. కార్మికులు రవిని పైకిలేవనెత్తుతున్నారు)

కార్మి: ఏమిటండీ! ఇతనేంచేశాడని ఇలా ప్రవర్తిస్తున్నారు?

రవి: (లేస్తూ) వారంటు లేకుండా సెర్చిచేసే అధికారం మీకులేదు

యస్పయి: ఎవడ్రా నీకు చెప్పింది? మాకా అధికారం వుంది

రవి: మీ చట్టాన్నే మీరు పాటించరా?

యస్పయి: చట్టమా? అదేమిటి! మాకున్నదొక్కటే- అధికారం. దానికి ఎవడు అడ్డం వచ్చినా బొక్కలో తోసేస్తాం.

(పోలీసులు ఏవో పత్రికలు వెతికి తెస్తున్నారు)

పోలీ: సార్.... సార్.... ఇది చూడండి.

యస్పయి: (చూస్తున్నాడు) ఏమిటాని ఇవి?

రవి : పత్రికల్లోని వ్యాసాల కటింగ్‌లు

యస్పయి: ఇవెందుకు నీకు

రవి : వీటినిచూసే నేను పాఠాలు చెప్తాను

యస్పయి: అంటే నువ్వు చెప్పేది ఏబీసీడీలు కావు, రాజకీయాలా?

రవి : అవును.

యస్పయి: అయితే నడువు స్టేషనుకు

రవి : ఎందుకు! రాజకీయాలు చెప్పడం తప్పేమీకాదే.

యస్పయి: నోర్ముయ్! మమ్మల్నెవరూ ప్రశ్నించగూడదు.

రవి : నన్ను అరెస్టు చేసేందుకు వారంటుందా మీదగ్గర?

యస్పయి: (కోపంతో) బద్మాష్! మమ్మల్నే ప్రశ్నిస్తావురా నువ్వు? వారంటు కావాలా? స్టేషన్‌కురా చూపిస్తా వారంటు. (రవిని కానిస్టేబుల్స్ వైపు తోస్తున్నాడు)

రవి : ఏమిటీ దౌర్జన్యం! (పెనుగులాడుతున్నాడు)

కార్మి : ఏమిటీ అన్యాయం.

యస్పయి: తీసుకుపదండి వీణ్ణి! స్టేషన్‌లో చూద్దాం వీడిసంగతి– (కార్మికుల వైపు తిరిగి) ఖబడ్దార్! ఈ నక్సలైటుగాణ్ణి రానిచ్చినందుకు మిమ్మల్ని లోపలికి తొయ్యాలి దొంగ వెధవల్లారా! ఇకనైనా జాగ్రత్తగా వుండండి.

(పోలీసులు రవిని తీసుకువెళుతుండగా, కార్మికులు నిశ్చేష్టులైవుండగా తెరపడుతోంది.)

## 3వ రంగం

[దృశ్యం: ఫాక్టరీముందు కార్మికులు మేడే పతాకావిష్కరణ చేస్తారు ఒక పక్క పతాకం కన్పిస్తూంటుంది. వేదికమీద రాజన్న, వీరన్న సుదర్శనం కూచుని వున్నారు. వెనక ఇద్దరు కార్మికులు నిలబడి ఉన్నారు. సభాదృశ్యం– వేదిక ప్రేక్షకుల వైపు తిరిగి వుంటుంది. ప్రేక్షకులే సభాసదులు.]

వీరన్న: (లేచి) ఇప్పుడు మన సుదర్శనం మాట్లాడుతాడు. (సుదర్శనం లేస్తాడు)

సుద : కార్మికమిత్రులారా! ఈ రోజు మేడే. కార్మికులు హక్కులు సాధించుకొన్నరోజు. కానీ మనం ఈ రోజు గూడా హక్కుల్ని కోల్పోతూనేవున్నాం.

మనం మన హక్కుల్ని పొందకుండా, వాటి కోసం పోరాటం చెయ్యకుండా కొంతమంది కార్మికద్రోహులు ప్రయత్నిస్తున్నారు. మన ప్రయోజనాల్ని యజమానులకి బలిపెడుతున్నారు. వాళ్ళకి వ్యతిరేకంగా ఉన్నవాళ్ళని పోలీసురిపోర్టులిచ్చి జైలుకి పంపిస్తున్నారు. ఈ పరిస్థితిని మనం ఎదుర్కోవాలి. మన మిత్రులెవరో, శత్రువులెవరో తెల్సుకోవాలి. లీడర్ల మోసాన్ని కుట్రలను బట్టబయలుచేయాలి. ఐకమత్యంగా నిలబడి పోరాడాలి .......

(సభలోకి నలుగురైదుగురు గుండాలు ప్రవేశిస్తున్నారు. వారిలో యాకోబ్ వున్నాడు అందరూ తాగివున్నారు)

యాకో : (మత్తులో) అరేయ్.... ఎవడ్రా.... లీడర్లని తిడుతున్నాడు లీడర్లు మనకు దేవుళ్లు వాళ్లులేకుంటే మనకేమీలేదు.

రాజన్న : ఒరే యాకోబ్ తప్పతాగి ఏమిట్రా కూతలు ?

యాకో : అరేయ్ రాజిగా ! ఏమిటీ నేను తాగికూస్తున్నానా ? దొంగ గాడ్దెకొడుకుల్లారా- లీడర్లని తిడతార్రా మీరు?.... నక్సలైటు నాకొడుకుల్లారా.... అరేయ్ జెండాని పీకిపడేయండ్రా....

(గుండాలు జెండాని పీకిపారేయడానికి వెళుతున్నారు )

సుద : వీరన్నా ! మన జెండాను కాపాడుకోవాలి మన జెండాను అవమానపరుస్తున్న ఈ కిరాయి రౌడీలని తిప్పికొట్టండి. (సుదర్శనం, వీరన్న, రాజన్న, మరి ఇద్దరు కార్మికులు జెండాకి అడ్డం నిలబడతారు)

వీరన్న : ఎవడూ ముందుకి రాకండి. జెండామీద చెయ్యివేశారో చస్తారు.

1వరౌడీ: చల్ నోర్ముఝ్యేటే. (తన వారితో) లాగిపారేయండ్రా.

(ఒకరిపై ఒకరు కలబడుతారు)

రాజన్న : (యాకోబ్ మీద కలబడుతూ) అరేయ్- యాకోబ్ ! జెండా దగ్గరికిరాకు.

(శంకర్రావు ప్రవేశిస్తున్నాడు)

శంక : (ప్రవేశిస్తూనే) ఏమిటి ఏంజరుగుతోందిక్కడ ? ఎందుకిలా కొట్టుకుంటున్నారు?

(శంకర్రావుని చూసి అందరూ ఆగుతారు. గుండాలు శంకర్రావు పక్కకి చేరుతారు.)

యాకో : (శంకర్రావుతో) రక్షించండి బాబో రక్షించండి ! వీళ్ళు మీటింగ్‌పెట్టి మిమ్మల్ని నానా బూతులు తిడుతూంటేవచ్చి 'ఇదేందయ్యా తిడతారు? తప్పు'

అన్నానండి. ఆమాట అన్నందుకు నన్నూ, వీళ్ళనీ కలిపి చితగ్గొట్టేశారండి. చూడండి బాబూ! దెబ్బలెలా తగిలాయో! (శరీరం చూపిస్తాడు)

శంక : (కోపంగా) ఏమయ్యా! మీటింగ్ పెట్టుకుని మీఏడుపు మీరేడవక నన్ను తిడుతున్నారా? నేనేంఅపకారం చేశానయ్యా! పైగా అడిగినందుకు మా వాళ్ళని కొడతారా? మీకుబాగా కొవ్వెక్కింది అడిగేవాడులేక!

సుద : మాటలు మర్యాదగారానియ్యండి. మిమ్మల్ని మీటింగ్ పెట్టి తిట్టాల్సిన గతి మాకేంపట్టలేదు. మీ గుండాలే మాపైదాడిచేసి మా జెండాని అవమానించ బోయారు. (ప్రేక్షకులవైపు చూపిస్తూ) ఈ కార్మికులంతా అది చూస్తూనే వున్నారు. అడగండి.

శంక : అడిగేదేమిటి? నాకుతెలీదా? నేనుఒక మీటింగ్ పెడితే పోటీగా మీరో మీటింగుపెట్టి నన్ను అల్లరిచెయ్యాలని చూస్తున్నారు.

సుద : మేం మీరంగువెలిసిన జెండాని గుర్తించం. మాజెండా— మారక్తంతో పెంచి పోషించుకున్న జెండామాకుంది. మీలాంటికార్మికద్రోహుల జెండాకిందికి మేం రాము.

శంక : ఏమిటీ నేను కార్మికద్రోహినా?

వీర : ద్రోహివో కాదో నీకు తెలీదూ? ఫాక్టరీ యజమాన్లదగ్గర లంచాలు దొబ్బడం వాళ్ళతో తాగితందనాలాడ్డం మాకు తెలియదనుకున్నావా?

రాజ : ఇంకా సిగ్గులేకుండా లీడర్నని తిరుగుతున్నావా?

1వరౌడీ: అరేయ్ మాదర్చోద్! మా లీడర్ని తిడితే ఊరుకోం.

రాజ : ఏం చేస్తావురా? (ముందుకి వస్తాడు)

(మళ్ళీ అందరూ కలబడతారు. రౌడీలు సుదర్శనాన్ని కొడతారు. తలకిగాయమవు తుంది. ఇద్దరు పోలీసులూ, యస్సయి ప్రవేశిస్తారు)

శంక : యస్సయిగారూ! ఆ ముగ్గుర్నీ పట్టుకోండి. రౌడీవెధవలు నామీద దాడి చేశారు. మావాళ్ళని కొడుతున్నారు. (పోలీసులు, యస్సయి వాళ్ళని పట్టుకో బోతారు. సుదర్శనం, వీరన్న, రాజన్నలు తప్పించుకుంటారు. ఇద్దరు కార్మికులుమాత్రం చిక్కుతారు.)

యస్సయి: పారిపోయారు వెధవలు!

శంక : నక్సలైటు నాకొడుకులండీ ! వాళ్ళని మీరెలాగైనా పట్టుకోవాలి. లేకపోతే నా ప్రాణంతీస్తారు.

యాకో : బాబో ! అరాజన్నగాడు నామీద పగబట్టాడు. నన్నుమీరే రక్షించాలి.

శంక : ఒరే పిరికివెధవా ! మనందర్ని రక్షించడానికి యస్సయిగారే వచ్చారాగ్రి !

యస్సయి: మీరేంభయపడకండి. ఆసంగతి నేనుచూసుకుంటా. అఁ- మరి-శంకర్రావ్ రాత్రికేమయినా ఏర్పాటు....

శంక: అమ్మమ్మ.... మీరింతఉపకారంచేస్తే ఏమీలేకుండా వుంటుందా ? నేను మాట విలువనుడే మనిషినండీ ! (ప్రేక్షకులనిచూపిస్తూ) కావాలంటే వీళ్ళని అడగండి నాసంగతి నేనెలాంటివాణ్నో.... కానీ నేను చెప్పిందానికన్నా పది నిముషాలు ఆలస్యంగా వచ్చారండీ మీరు. కాస్తముందొస్తే మనం అనుకున్నట్టు ఆనక్సలైటు వెధవలు దొరికిపోయి వుండేవారు. నాబాధతీరేది.

యస్సయి: చాల్లేవయ్యా ! నీకోసంరావడమే మాకు పననుకున్నావా ?

శంక : అహఁ అదికాదనుకోండి- సరే రాత్రికి మళ్ళీ ఏదైనా ఉపాయం ఆలోచిద్దాం పదండి.

(అందరూ వెళుతుండగా తెరపడుతోంది)

## 4వ రంగం

[దృశ్యం : రాత్రి- ఒక చిన్నగది. చాపమీద సుదర్శనం కూచునివున్నాడు. తలకికట్టు. అతని పక్క పుస్తకాల దొంతరవుంటుంది. ఆపుస్తకాల్లో చూస్తూ తెల్లకాగితాల మీద ఏదో రాస్తున్నాడు. అతనిముందు వీరన్న కూచునివున్నాడు ]

సుద : (అవులించి) వీరన్నా ! టయిమెంత అయిందో !

వీర : (బయటికిచూస్తూ) మూడు గంటలయివుంటుంది. కాసేపట్లో తెల్లారుతుంది.

సుద : రాజన్న ఇంటికి పోయి ఈపాటికి రావాలే. ఎందుకు రాలేదో ?

(పెన్నుమూసి) సరే. ఇదిగో కాగితాలు ఇవి సైక్లోస్టైల్ చేసి పొద్దున్నే కార్మికుల్లో పంచాలి.

[వీరన్న కాగితాలు అందుకుంటున్నాడు. ఒక కార్మికుడు పరిగెత్తుకుంటూ వస్తున్నాడు]

కార్మి : (ఆందోళనగా) వీరన్నా.... వీరన్నా....

వీర : (కంగారుగా లేచినిలబడ్డాడు. సుదర్శనం కూడా) ఏం నారాయణా ? ఎందుకు గాభరాపడుతున్నావ్ ? ఏం జరిగింది ?

నారా : కొంపమునిగింది బాబూ ! అంతా ఘోరం జరిగిపోయింది.

సుద : ఏంజరిగిందో చెప్పు.

నారా : ఆ యాకోబ్‌గాడు లేడండీ ! వాణ్ణి ఎవరో చంపేశారు. అది మనమే చేయించామని మన రాజన్నను పోలీసులు అరెస్టు చేశారు.

సు: వీ: ఆఁ (నిశ్చేష్టులైపోతారు)

సుద : (తేరుకొని) ఇంతకీ అపనిచేసిందెవరో తెలిసిందా ?

నారా : లేదు. మన వాళ్లెవరూ అలాంటి నీచప్పనిచెయ్యరు. ఇదేదో కుట్ర అని నాకు తోస్తోంది.

సుద : అవును ఇదికుట్రే. పొద్దున జరిగిన గొడవలో పగదీర్చుకోటానికే శంకర్రావు ఈ పన్నాగంపన్నాడు.

వీర : అవును, యాకోబు గాడికీ, రాజన్నకీ బాగా గొడవైంది. దాన్ని ఆసరాగా తీసుకుని వాడిలా చేసివుంటాడు.

నారా : నిజమే. శంకర్రావుగాడు యస్సయితో కలిసి తిరుగుతున్నాడు. ఇద్దరూకలిసి కార్మికుల ఇండ్లమీదపడి దౌర్జన్యంచేస్తున్నారు. ఇంట్లో ఆడవాళ్ళని బూతులు తిడుతున్నారు.

సుద : వీరన్నా ! చూశావా శత్రువు ఎలాటిపన్నాగంతో వచ్చాడో ! సమయానికి రవిబాబుకూడాలేడు ఇలా మనవాళ్ళందర్నీ ఏదో పేరుమీద [అరెస్టు]చేస్తే మనం ఏంచెయ్యలేమని వాడిఉపాయం. ఇప్పుడు ఇళ్ళలో నేవుంటే బహుశా మనంకూడా అరెస్టయేవాళ్ళం.

వీర : అవును మనం ఇక్కడుండడం మంచిదైంది.

సుద : సరే. ముందు అరెస్టయిన రాజన్న సంగతి చూడాలి. నేను లాయర్ దగ్గరికి వెళ్ళొస్తాను. ఏమన్నా వీలుంటుందో చూడాలి విడిపించడంకోసం.

వీర : ఒక్కడివే వెళతావా ?

సుద : అవును. నువ్విక్కడేవుండు. ఈ కాగితాలు సైక్లోస్టైల్‌చేసి రేపు కార్మికుల్లో పంచిపెట్టు. జరిగినవిషయంలో నిజానిజాలు కార్మికులకు తెలియజెప్పండి.

వాళ్ళ ధైర్యాన్ని శత్రువు దెబ్బదీయకుండా చూడాలి. పనులు ఆగిపో కూడదు. జాగ్రత్తగావుండండి.

(సుదర్శనం బయటికి వెళుతుండగా తెరపడుతోంది)

[తెరలేస్తుంది. అదేగది – అదేఅలంకరణలు. సుదర్శనం, వీరన్న.]

వీర : రోజురోజుకి శంకర్రావుగాడి ఆటలు ఎక్కువవుతున్నాయి. రాజన్నని దొంగ కేసులో ఇరికించి అప్పుడే వారంరోజులైంది. బెయిలుకూడా ఇవ్వకుండా చేశాడు దొంగవెధవ !

సుధ : భయంలేదు వీరన్నా ! వాడుఎన్ని ఎత్తుగడలువేసినా మన కార్యక్రమాలు ఆగవు. మనది ప్రజాశక్తి. ప్రజాశక్తికి చావులేదు. కార్మికుల్లో మనం ఇంకా తీవ్రంగా పనిచేయాలి. అందర్నీ కలుసుకుని మాట్లాడాలి. వాస్తవాలు వివరించాలి.

వీర : కాని కార్మికుల్లో కొంతమంది భయంతో ఉన్నారు.

సుద : ఆ భయం మనగూర్చికాదువీరన్నా ! పోలీసులు సృష్టించిన భయానక వాతావరణం వాళ్ళని వెనక్కిలాగుతోంది. మనంచేయాల్సిన పని ఆ భయాన్ని పోగొట్టటమే.

[గదిలోకి రవి ప్రవేశిస్తున్నాడు]

సుద : (ఆశ్చర్యంతో) రవీ ! ఎప్పుడొచ్చావు ? పోలీసులు వదిలేశారా ?

రవి : ఇప్పుడే వస్తున్నాను. వదిలేయక ఏంచేస్తారు ? నామీద కేసుపెట్టడానికి బలమైన ఆధారాలులేక వదిలేశారు ఐనా ఓకన్నువేసే ఉంచారు. మళ్ళీ ఎప్పుడో దేన్లోనో ఇరికిస్తారు.

వీర : పోలీసులు నిన్నేమీ కొట్టలేదుగదా !

రవి : కొట్టకపోతే వాళ్ల పోలీసు లెలాఅవుతారు ? ఈనెల రోజుల్లోనూ నన్ను నీరుగార్చడానికి ఎన్నిచేయాలో అన్నీ చేశారు నాఫోటోలు తీసుకుని, అడ్రసు రాసుకుని వదిలేశారు.

సుద : అయితే డబ్బుల్లేకుండా ఫోటోదిగావన్న మాట (నవ్వుతారు అందరూ)

రవి : మీక్కూడా ఆయోగం త్వరలో పడుతుందిలే. మీపేర్లూ వాళ్ళదగ్గరవున్నాయి.

సుద : దానికి భయపడేదెవడు ?

రవి : ఊఁ. ఈనెల రోజుల్లో చాలా జరిగాయే మార్పులు.

వీర : అబ్బో! ఒకటా రెండా ఎన్నని! చెప్పాలంటే చాలా వున్నాయి.

రవి : నేను లాకప్‌లోవున్నా అన్నీ తెలుస్తూనే వున్నాయి నాకు.

సుద : అయితే మన రాజన్న సంగతి....

రవి : నాకు తెల్సు. లాకప్‌లో అతనితో మాట్లాడాను కూడా.

సుద : ఇప్పుడు మన కార్యక్రమం ఏమిటి ?

రవి : కార్మికుల పరిస్థితి ఎలావుందో ముందు చెప్పండి.

సుద : కొంతమంది భయంతో, ఊగిసలాటలోవున్నారు

రవి : కార్మికులకి ఎవరుమంచివాళ్లో, ఎవరు దుర్మార్గులో బాగాతెలుసు. అయితే ఈ రాజ్యాంగ యంత్రాన్నిచూసి వాళ్ళు భయపడతారు. పోలీసులూ, అధికార్లూ ప్రజాశక్తిముందు ఎందుకూ పనికిరారని వాళ్ళకి తెలియజెప్పాలి. యాకోబ్‌ని వాళ్ళేచంపి, కార్మికుల్ని చీల్చడంకోసం మనమీద రుద్దుతున్నారని వివరించాలి. ఇలాంటిమోసాల్ని ఎండగట్టాలి- ఇదివరకు జర్మనీలో నాజీలుపార్లమెంటుని తగలబెట్టి కమ్యూనిస్టులే ఆపని చేశారని ప్రచారం చేశారు. ఇలాంటివి చరిత్రలో కొత్తవేమీకాదు.

సుద : అవును. ఆపనిచేయాలని మేం ఇప్పుడే అనుకున్నాం.

రవి : అంతేకాదు. మన కళ్ళఎదురుగా కన్పిస్తున్న ఈ దొంగలీడర్లు కేవలం నక్కలు- పాలకవర్గాలు విదిలించే ఎంగిలికూటికోసం ఆశపడే నక్కలు. వీళ్ళు యజమానుల ప్రయోజనాలకోసం పనిచేస్తారు- మన ప్రధానశత్రువు ఈ దోపిడీ రాజ్యాంగయంత్రం- ఈ లీడర్లకుట్రలని ఎదుర్కొంటూనే మనం ఈ దోపిడివ్యవస్థతో పోరాడాలి-

సు: వీ: అవును మనం ఈ రాజ్యాంగయంత్రంతో కూడా పోరాడాలి.

రవి : పోరాడితీరుతాం. మనం ఒక వ్యవస్థకోసం కృషిచేస్తున్న వాళ్ళం. అది సిద్ధించేంత వరకు మనకు విశ్రాంతి వుండకూడదు. మనం చిందించే ఒక్కో రక్తపుచుక్కా ఈవ్యవస్థను అగ్నికణమై కాల్చేస్తుంది. "నిప్పురవ్వదావానల మగును" ఇదే మనకు ఊపిరి. ఈ నిప్పురవ్వల్ని మనం సృష్టించాలి. ఈ క్రమంలో పాలకవర్గం ట్రేడ్‌యూనియన్లని అడ్డంపెట్టుకుని కార్మికుల్ని విడ

## భాగ్యవంతుల చేతుల్లోన భారతదేశం ఇరుక్కున్నది

దేశాన్ని తాకట్టుపెట్టి మన ప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్యనిధిసంస్థ [ఐఎంఎఫ్] నుంచి ఐదువేలకోట్ల రూపాయలు అప్పుతెస్తూంది.

1944 బ్రెటన్‌ఉడ్స్ ఒప్పందం ఫలితంగా ఐఎంఎఫ్ ఏర్పడింది- దేశాలమధ్య బహుముఖ వాణిజ్యాన్ని ప్రోత్సహించడం ఐఎంఎఫ్ లక్ష్యాల్లో ఒకటి- విదేశీవాణిజ్యం ద్విముఖ వాణిజ్యం, బహుముఖ వాణిజ్యం అని రెండు విధాలుగా ఉంటుంది- ద్విముఖ వాణిజ్యంలో ఒక దేశం ఇంకోదేశం నుంచి ఎంత విలువగల సరుకులు దిగుమతి చేసుకుంటుందో అంతే విలువగల సరుకులు ఎగుమతి చేయవలసి ఉంటుంది. దీనిఫలితంగా విదేశవాణిజ్యం మందకొడిగా సాగడమేకాక బహుళజాతి సంస్థల వాణిజ్యం ప్రబలంగా ఉన్న ఈరోజుల్లో కష్టసాధ్యమవుతుంది- బహుముఖ వాణిజ్యంలో ఈ నిబంధన ఉండదు- దీని ఫలితంగా కొన్నిదేశాల విదేశీ వాణిజ్యంలో చెల్లింపులలో లోటు ఏర్పడుతుంది- ఐఎంఎఫ్ లక్ష్యాలలో బహుముఖ వాణిజ్యాన్ని ప్రోత్సహించడం ఒకటి. ఐఎంఎఫ్ బహుళజాతి సంస్థల ప్రయోజనాలను పరిరక్షిస్తుందనడానికి ఇది తార్కాణం. ఐఎంఎఫ్ సభ్యులయిన అన్ని దేశాలనుంచి వాటాల ప్రకారం నిధిసేకరిస్తుంది. సభ్య

---

దీసి తమ ప్రయోజనాలు నెరవేర్చుకుంటారు. ఆ ప్రయత్నాలు మనం ఎదుర్కోవాలి. నాశనం చెయ్యాలి. ఎర్రచొక్కా తొడుక్కున్నవాడల్లా విప్లవకారుడుకాదని కార్మికులు గుర్తించేటట్టు చెయ్యాలి.

వీర : నువు మాట్లాడుతూంటే కొత్త శక్తి వస్తోంది

సుధ : ఈ వ్యవస్థను నాశనం చేయడానికి బలంకూడుతున్నట్టనిపిస్తోంది

రవి : ఈ ఉత్సాహం మనకు ఎల్లప్పుడూ వుండాలి. ఈవ్యవస్థ మన శత్రువు. దీన్ని నాశనం చేయడం కోసం మన మహాప్రస్థానం!

అందరూ: అవును అక్కడికే మన దండయాత్ర!

రవి : కామ్రేడ్స్! మనమంతా ప్రజలపట్లా సమాజంపట్లా బాధ్యతలున్న వాళ్ళం. కార్మిక శ్రేయస్సు కోసం మనం ఎల్లవేళలా సర్వసన్నద్ధులమై వుండాలి. తుదకంటా పోరాడి మన అర్హత నిలుపుకోవాలి. శత్రువు ఎన్నినిర్బంధాలు, దౌర్జన్యాలు ప్రయోగించినా లొంగకూడదు. కార్మికులందరం మతాలుగా చీలిపోకుండా ఐక్యంగా నిలబడాలి. శ్రామికరాజ్యం మన ధ్యేయం, పోరాటం మన తల్లి- ఆచరణ మన గురువు.

అందరూ: కార్మిక పోరాటం వర్ధిల్లాలి, దోపిడి రాజ్యం పోవాలి

[నినాదాలిస్తూంటే తెరజారుతోంది]

అయిన దేశాలకు వాళ్ళ విదేశీ వాణిజ్యంలో లోటు పూరించుకోవడానికి గాను వాళ్ళ వాటాలో 25%కి మించకుండా అప్పుఇస్తుంది. ఈ అప్పు ఇవ్వడానికి ఎలాంటి నిబంధనలూ ఉండవు. అయితే ప్రస్తుతం మన దేశానికి ఇస్తున్న అప్పు 'విస్తృత నిధిసౌకర్యం' అనే ప్రత్యేక సౌకర్యంగా ఇవ్వబడుతున్నది. ఈ సౌకర్యానికి ఒప్పుకున్న అప్పుతీసుకునే ప్రభుత్వం విధిగా కొన్ని లిఖితపూర్వక హామీలివ్వాల్సి ఉంటుంది.

ఐఎంఎఫ్‌లో మనదేశానికి కూడా సభ్యత్వం ఉంది. విదేశీవాణిజ్యంలో ఏర్పడిన లోటును పూరించుకోవడానికిగాను ఐదువేలకోట్ల రూపాయలు అప్పు ఇవ్వవలసిందిగా భారతప్రభుత్వం ఐఎంఎఫ్‌ను కోరింది. ఈ అప్పుమొత్తాన్ని మూడు సంవత్సరాల్లో ఇస్తారు. ఈసంవత్సరం పన్నెండు వందలకోట్ల రూపాయలు, వచ్చే సంవత్సరం పదహారువందల కోట్ల రూపాయలు తర్వాతి సంవత్సరం ఇరవైరెండువందల కోట్ల రూపాయలు చొప్పున ఇస్తారు.

ఐఎంఎఫ్ చరిత్రలోనూ, ప్రపంచ వాణిజ్యచరిత్రలోనూ ఇది అతిపెద్ద అప్పు. 1980 చివరిలో ప్రారంభమై ఇప్పటిదాకా నడుస్తున్న ఈ అప్పు చర్చలు అత్యంత రహస్యంగా ఉంచబడ్డాయి. భారత ఆర్థికమంత్రి ఐఎంఎఫ్‌కు రాసిన లేఖను, దానితో బాటు 'ఆర్థిక వ్యూహం, విధానాల'ను వివరించిన నివేదికను ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకులకు చెందిన రెండు బృందాలు నిశితంగా పరిశీలించాయి. ఈ రెండు బృందాలు 1981 జనవరిలోనూ, ఏప్రిల్‌లోనూ మనదేశం సందర్శించాయి. జూన్‌లో పారిస్‌లో, జూలైలో లండన్‌లో, ఆగస్ట్‌లో వాషింగ్టన్‌లో ఈ విషయమై చర్చలు జరిగాయి.

ఈ వివరాలేవీ ప్రభుత్వం ఎక్కడాప్రకటించలేదు ఎంతో రహస్యంగా కాపాడింది. ఈ విషయానికి సంబంధించి నివేదికలేవీ విడుదలకాలేదని ఆర్థిక శాఖా మంత్రి వెంకటరామన్ ప్రకటించాడు. కాని అప్పటికే ఆ నివేదిక యాభైకాపీలు ఐఎంఎఫ్ కు అందజేయబడ్డాయి.

ఈవిషయాన్ని ప్రభుత్వం అంతరహస్యంగా ఎందుకు పరిగణించవలసి వచ్చింది ? ఎందుకంటే ఈ అప్పుపొందడానికై భారతప్రభుత్వం ఐఎంఎఫ్ విధించిన అవమానకరమైన షరతులెన్నింటికో తలఒగ్గిందిగనుక. లిఖితపూర్వకంగా భారత ప్రజానీకపు ప్రయోజనాలను ఐ ఎం ఎఫ్ పాదాలదగ్గర తాకట్టుపెట్టిందిగనుక.

ఐ ఎం ఎఫ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ ఒకరు రహస్యాలను కాపాడేనియమాన్ని ఉల్లంఘించి ఈ వివరాలన్నిటినీ ఒక పత్రికావిలేఖరికి అందజేశారు. "ఇంతపెద్ద వ్యవహారం నడుపుతున్నప్పుడు ఏదేశమైనా దానిగురించి పార్లమెంట్‌లోనూ,

పత్రికల్లోనూ, ప్రజల్లోనూ విస్తారమైన చర్చజరపాలి" అనే అభిప్రాయంతో ఆయన ఈ వివరాలను బయటపెట్టారు.

ఐ ఎం ఎఫ్ డాక్యుమెంట్లన్నీ సాధారణంగా రహస్యంగా ఉంచబడుతాయి- బ్రిటిష్ ప్రభుత్వంమాత్రం ఒకసారి ఈ-డాక్యుమెంట్లను పార్లమెంట్‌ముందు పెట్టవలసి వచ్చింది- ఇటలీప్రభుత్వం ఈ డాక్యుమెంట్లను సిగ్గుతో బహిరంగ పరచవలసి వచ్చింది.

ఐ ఎం ఎఫ్ విధిస్తున్న షరతులగురించి ప్రశ్నిస్తే వెంకటరామన్ 'తన డబ్బు భద్రంగాతిరిగివస్తుందా రాదాఅని ఏవ్యాపారిఅయినా అనుమానపడతాడ'ని జవాబిచ్చాడు, ఐతే ఐఎంఎఫ్ అందరిలాంటి మామూలు 'వ్యాపారి' కాదు- దాని పాత్ర ఆయన చెప్పినంత సాధారణమైంది కాదు- దానికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలూ, ఉద్దేశ్యాలూ ఉన్నాయి.

ప్రస్తుతం భారతదేశానికి అప్పుఇవ్వడానికి ఐఎంఎఫ్ కొన్ని షరతులువిధించింది. ఆ షరతుల్లో సాంఘిక, ఆర్థికవిధానాలు, పరిమితులు మొదలైన వాటిని అప్పు తీసుకుంటున్న ప్రభుత్వం లిఖితపూర్వకంగా అంగీకరించాలి- ఈ మొత్తం షరతుల్లో కొన్ని ముఖ్యమైనవిగా ఐఎంఎఫ్ భావిస్తున్నది- 'పనితీరును నిర్ణయించే విధానాలు' కింద విధించిన షరతులు ముఖ్యమైనవి- దేశంలో బ్యాంకుల్లోని వ్యక్తిగత పొదుపులమీదా, బ్యాంకులు ప్రభుత్వం వద్దఉంచే నిలవల మీదా కనిష్టపరిమితి విధించడం, విదేశీ రుణాలపై పరిమితి విధించడం ఈ షరతుల్లో కొన్ని- ఈ నిబంధనలు రెండోసంవత్సరానికీ, మూడో సంవత్సరానికీ తగినట్టుగా మార్చడం కూడా ఒక షరతు- ఇవికాక మూడేళ్ళకాలానికి విధించబడిన నిబంధనలు : 1. ప్రస్తుత అంతర్జాతీయ ఆర్థిక వ్యవహారాలలో కొత్త నిబంధనలు విధించగూడదు, ఉన్న నిబంధనలను కఠినతరం చేయగూడదు. 2. విదేశీ వాణిజ్యంలో లోటు పేరుమీద దిగుమతి నిబంధనలు కొత్తగా విధించగూడదు, ఉన్నవాటిని కఠినతరం చేయగూడదు. 3. విదేశీ మారకపురేట్లలో తేడాలు ఉండగూడదు. 4. ఏదేశంతోనూ ద్విముఖ వాణిజ్య ఒప్పందాలు చేసుకోగూడదు. 5. భారత ప్రభుత్వం ఐఎంఎఫ్‌తో సన్నిహిత సంబంధాలు కలిగిఉండాలి. తన ముందుపెట్టుకున్న లక్ష్యాలనూ, విధానాలనూ సాధించడంలో భారతదేశపు అభివృద్ధిని తెలుసుకోవడానికి వీలుగా ఐఎంఎఫ్ కోరిన సమాచారమంతా అందజెయ్యాలి.

ఈ షరతులవల్ల దేశంలోని ఆంతరంగిక ఆర్థిక పరిస్థితిలో కలిగే మార్పులు తీవ్రంగా ఉంటాయి- ఈ షరతుల నిజస్వరూపాన్ని, దానివల్ల దేశఆర్థిక వ్యవస్థలో

కలిగే మార్పులను ఏడేళ్ళక్రితం చెరిల్ పేయర్ 'అప్పుఊబి: ఐఎంఎఫ్ - మూడో ప్రపంచం' అనే పుస్తకంరాస్తూ ఇలా వివరించింది. 1. విదేశీ మారకం మీద పరిమితుల్ని ఎత్తివేయడం, సులభతరం చేయడం- 2. మారకపు విలువను తగ్గించడం- 3. దేశంలో ద్రవ్యోల్బణ వ్యతిరేక చర్యల మీద కొన్ని చర్యలు చేపట్టడం- అవి i బ్యాంకుల అప్పుపై పరిమితి, ఎక్కువ వడ్డీరేట్లు, బ్యాంకులు తప్పనిసరిగా ఉంచుకోవాల్సిన నిలవల పెంపుదల ii ప్రభుత్వలోటుపై పరిమితి, ఖర్చుపై పరిమితి, పన్నుల పెంపుదల, ప్రభుత్వరంగ వస్తువుల ధరల పెంపుదల, వినియోగవస్తువుల తయారీకి ఇచ్చే సబ్సిడీల తగ్గింపు- iii జీతాల పెరుగుదలపై పరిమితి, ధరలపెరుగుదల పరిమితిపై పట్టుసడలించడం- 4. విదేశీ పెట్టుబడులను పెద్దఎత్తున ఆహ్వానించడం.

వీటిలో మారకపు విలువను తగ్గించమని ఐఎంఎఫ్ షరతుపెట్టలేదని ప్రభుత్వం అదేదో ఘనకార్యమైనట్టు ప్రచారం చేస్తున్నది- నిజానికి 1966 లో ప్రారంభమైన రూపాయివిలువ పడిపోవడంఅనే వెనుకడుగు కొత్తగా ఐఎంఎఫ్ విధించవలసిన అవసరమేలేదు. 1966 లో రూపాయి మారకపు విలువను తగ్గించడానికి ప్రభుత్వం నిర్ణయించుకున్ననాటినుంచి ఇప్పటికిఅది 16 పైసలకు పడిపోయింది. ఇక పైషరతుల్లో ముఖ్యమైనదీ, ప్రజాజీవన పరిస్థితిమీద ప్రత్యక్షప్రభావం వేసేదీ మూడోషరతు- వాటిలో బ్యాంకుల అప్పుపై పరిమితి విధించడం ద్వారా ప్రజలకు బ్యాంకుల ద్వారా అప్పులు సులభంగా దొరకకుండా చేయడం జరుగుతుంది- బ్యాంకులిచ్చే అప్పులకు వడ్డీరేట్లు పెరుగుతాయి- బ్యాంకులు తప్పనిసరిగా ఉంచుకోవాల్సిన నిలవలు పెరగడంవల్ల బ్యాంకులు ఇచ్చే అప్పుల పరిమాణం తగ్గిపోతుంది- పన్నులు - ప్రత్యక్ష, పరోక్ష పన్నులు రెండూ- పెరుగుతాయి- ప్రభుత్వరంగంలో తయారుచేయబడే వస్తువులన్నిటి ధరలూ పెంచబడతాయి- దీని ఫలితంగా ప్రైవేట్‌రంగ వస్తువుల ధరలు కూడా పెరుగుతాయి- కొన్ని ప్రజావినియోగ వస్తువుల తయారీకి ప్రస్తుతం ఇవ్వబడుతున్న సబ్సిడీ రద్దుచేయడంవల్ల ఆ వస్తువుల ధర పెరుగుతుంది- ఈ ధరల పెరుగుదలఇట్లా నిరాటంకంగా సాగిపోతుండగా దాన్ని అడ్డుకునే చర్యలేవీ ప్రభుత్వం తల పెట్టదు- పైగా ద్రవ్యోల్బణ నిరోధం పేరుమీద ఉద్యోగుల జీతాలపై పరిమితులు విధిస్తుంది- పని విధానాన్ని కఠినతరం చేస్తుంది- దీని ఫలితం మనం ఇప్పటికే వెలువడిన అత్యవసర సర్వీసుల చట్టంలో చూడవచ్చు- ఈ చర్యల ఫలితంగా వచ్చే ప్రతిఘటనని ఎదుర్కోవడానికే ప్రభుత్వం జాతీయభద్రతా చట్టం తయారుచేసింది. 'పనికిఆహారం' పథకం రద్దుచేసింది.

నిజానికి మనకు ప్రస్తుతం ఇంతపెద్దఅప్పు తీసుకోవాల్సిన అవసరమేలేదు- మనదేశం విదేశాలనుంచి యంత్రాలు, ముడిసరుకులు, పెట్రోలియం, ఎరువులు, సాంకేతిక పరిజ్ఞానాలను దిగుమతి చేసుకుంటున్నది- స్వయంసమృద్ధి అభివృద్ధి వ్యూహంఅనే పెద్దపెద్దమాటలేతప్ప వీటిలో ఏవస్తువు దిగుమతినీ ప్రభుత్వం ఇంత వరకూ ఆపేయలేకపోయింది- మొదటి పంచవర్ష ప్రణాళికాకాలంనుంచి 1978-79 వరకు భారతదేశం 19,230 కోట్లరూపాయల విదేశీసహాయాన్ని పొందింది. దీనిలో 5097 కోట్లరూపాయలు మాత్రమే తిరిగి చెల్లించబడ్డాయి- 2786 కోట్లరూపాయలు వడ్డీగా చెల్లించబడ్డాయి- ఈ అప్పులుకాక విదేశీ ప్రైవేట్ పెట్టుబడికూడా పెద్దఎత్తున్నే దేశం లోకి చొచ్చుకవచ్చింది. ఇది విదేశీవాణిజ్యంలో లోటును పూరించినట్టే కనబడుతుంది గాని నిజానికి దేశాన్ని డొల్లచేసి వదిలిపెడుతుంది- 1951 నుండి 1968-69 వరకు విదేశీ ప్రైవేట్‌పెట్టుబడి మనదేశంలోకి సాలీనా 62 కోట్లరూపాయల చొప్పున ప్రవేశించింది- లాభంకింద, వడ్డీకింద, వాటాకింద విదేశాలకు తరలించుకవెళ్ళింది సాలీనా 77 కోట్లరూపాయలు! వీటన్నిటివల్ల విదేశీవాణిజ్యంలో మనకు పెద్దలోటు ఏర్పడినమాట నిజమే- ప్రస్తుతం విదేశీవాణిజ్యంలో మనకు 5436 కోట్లరూపాయల లోటుఉంది- ప్రస్తుతం మనదగ్గర 5164 కోట్లరూపాయల విదేశీమారక ద్రవ్య నిలవలున్నాయి- కనుక అప్పుతీసుకోకపోతే వెంటనే మనం దివాళాతీసే పరిస్థితేమీ లేదు.

కనుక చాలాస్పష్టంగా ఈ అప్పు జాతీయప్రయోజనాలు కాపాడడానికి అనే పేరుతో పాలకవర్గాల ప్రయోజనాలు కాపాడడానికే తేబడుతున్నది- అందువల్లనే జాతీయ ప్రయోజనాలు బలిపెట్టి ఈ అప్పుతేవడం జరుగుతున్నది- ఈడబ్బును పాలక వర్గాలు రెండురకాలుగా ఉపయోగించుకుంటాయి- 'రక్షణావసరాలు'అనే ముసుగు కింద పాలకవర్గాల రక్షణకవసరమైన యంత్రాంగాన్ని పటిష్టంచేయడానికి ఈ డబ్బు ఉపయోగించబడుతుంది.

మొట్టమొదట ఫ్రాన్స్‌నుంచి మనదేశంకొంటున్న యుద్ధవిమానాలు- ఇందిరా గాంధీ స్వయంగావెళ్ళి ఈ విమానాల కొనుగోలు ఒప్పందంచేసుకొనివచ్చింది- రక్షణా వసరాలకు మొత్తం బడ్జెట్‌లో 4,001 కోట్లరూపాయలు సమకూర్చబడ్డాయి- ఇది గత సంవత్సరంకంటె 14.2% ఎక్కువ- అంటే మొత్తంబడ్జెట్‌లో రక్షణావసరాలకు 16.4 శాతం వినియోగించబడుతున్నది- ఇందుకై విస్తృతంగా పాకిస్తాన్‌తో యుద్ధం అనే అబద్ధప్రచారంకూడా చేయబడుతున్నది.

సమీక్ష :

## రోడ్డుమీద సూర్యుడు

ప్రాచీన కవి సమయాలను, నియమాలను, ఛేదించుకొని తెలుగుకవిత్వం తనకుతానుగా, స్వచ్ఛందంగా బహిర్గతమై ఇప్పటికి చాలాకాలమైంది. కవిత్వాన్ని గురించి చర్చించేటప్పుడు, కవిత్వంఅవునా, కాదా, అన్న అంశానికి, ప్రయోజనకర కవిత్వం అవునా, కాదా, అన్న అంశానికిమధ్య, అంతరం చాలావుంది. ఏది ప్రయోజనకర విషయం అన్నప్పుడు, భేదాభిప్రాయాలు రావటంసహజం. అయితే సమాజం ఒకస్థితినుండి మరొకస్థితికి పరిణామం చెందుతుంది. ఈ పరిణామస్థితిలో ఉద్భవించిన కవి మానవ సంక్షేమంకోసం, మహత్తర మానవతా వ్యవస్థకోసం తపనపడేటప్పుడు, మాత్రమే భవిష్యత్తును దర్శించగలుగుతాడు. భవిష్యద్దార్శనికత ప్రతికవికి సాధ్యమయ్యే అల్పవిషయంకాదు. సమాజంపట్ల, తద్గతమైన జీవితంపట్ల, గడిచిన, గడుస్తున్న చరిత్రపట్ల ఒక స్పష్టమైన అవగాహన, ఒక నిర్దుష్టమైన దృక్పథం, పీడిత మానవజాతిపట్ల అనంతమైన సానుభూతి, ఆగామి మానవ వ్యవస్థపట్ల అచంచలమైన విశ్వాసంఉన్న వాడికి మాత్రమే ఇదిసాధ్యం.

వర్తమానసమాజం వర్గభేదాలతో, వర్ణభేదాలతో సంక్షుభితమై, అవ్యవస్థితమై, అస్థిరమై, అతివేగవంతమై, సాగుతోంది. ఈసంక్షుభిత, సంక్లిష్ట, సంకీర్ణసమాజంలో ప్రతికవీ ఆధునికుడుగా పీడితసమాజంమీద సానుభూతిపరుడుగా సమాజ సత్వర మార్పును కాంక్షిస్తున్నవాడిగా, గుర్తించబడాలని వేదనపడుతున్నట్లు ఈనాటి శతానేక కవితాసంకలనాలు రుజువుచేస్తున్నాయి. మానవతావాదం, పీడితులపట్ల సానుభూతి,

---

ఇక అప్పువల్ల రెండోఫలితంగా దేశంలో పౌరహక్కుల అణచివేత- దీని ఛాయలు మనకుఇంకా అప్పువిడుదల కాకముందునుంచే కనబడుతున్నాయి- ఐ ఎం ఎఫ్‌కు సమర్పించిన నివేదికలో "అదనపు నిలువలు సేకరించడానికి ప్రభుత్వం తీవ్రమైన చర్యలు చేపడుతున్నది ... ధరలలో అస్థిరత్వం ఉండేటట్టుచూడడం ప్రభుత్వ ఉద్దేశ్యం-"అని సిగ్గువిడిచి చెప్పుకున్నప్రభుత్వం అదనపునిలువల సేకరణకోసం జీతాల్లోకోత, సమ్మెలనిషేధం మొదలైన ఎన్నో కార్మిక వ్యతిరేకచట్టాలు ప్రవేశ పెడుతున్నది- కార్మికుల న్యాయమైనహక్కులను కాలరాస్తున్నది- రాజ్యాంగ యంత్రాన్ని పటిష్టంచేసి ఉవ్వెత్తునలేస్తున్న ప్రజాపోరాటాలను అణచివేయ ప్రయత్నిస్తున్నది.

[హిందూలో ఎన్. రామ్, సండేలో రంజిత్‌సావు, ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో బిఎం వ్యాసాల ఆధారంగా]

సమసమాజం రావాలనేకాంక్ష, ఈనాటికవులలో ఎక్కువగా కనబడుతుంది. అయితే ఇట్లారాసే కవులందరికి ఒకలక్ష్యం ఉన్నదా ? అనిప్రశ్నిస్తే చాలమందిలో లక్ష్యమాన్యమైన ఆరాటం, కీర్తికండూతితప్ప, నిజమైన 'కాంటెప్లేషన్' కనబడదు. దీనికికారణం ఒక్కటే, సర్వత్రావ్యాపించిన ఆధునిక సామాజిక చైతన్యంలో తామూ భాగస్వాములమని చెప్పుకొని తద్వారా పాపులర్ అవ్వాలనే తీవ్రమైన ఆకాంక్ష. జీవితంలో నిజాయితీలేనపుడు, కవిత్వంలో నిజాయితీఉండదు. ఒకవేళ నిజాయితీ ఉన్నట్లు కనబడినా, అది ఆభాసేకాని, నిజంకాదు.

కె. రాంమోహన్‌రాజుగారు రాసిన "రోడ్డుమీద సూర్యుడు" కవితా సంకలనం ఇటీవల వచ్చిన కవితా సంకలనాల్లో విలక్షణమైంది, విశిష్టమైంది- ఆధునిక కవిత్వంలో [వచన కవిత] నినాదాలు కవిత్వాస్థానాన్ని ఆక్రమిస్తున్నాయని ఆక్రోశించేవారికి, ఈ కవితా సంకలనం గుణపాఠం నేర్పుతుంది- శ్రీశ్రీ చెప్పినట్లుగా వస్తువు, సంవిధానము, ఈ రెండు సమైక్యం చెందినప్పుడే, ఉత్తమ కవితావిర్భూతి జరుగుతుంది- వస్తువు రూపాన్ని అన్వేషిస్తుంది అని చెప్పటం ఇవ్వాళ కొత్త విషయం కాదు- ఈ సంకలనంలో వస్తువు సమాజపీడన- పరిష్కారం తిరుగుబాటు. ఫలితం సమసమాజవ్యవస్థా నిర్మాణం- రాంమోహన్‌రాజుగారు తన దృక్పథంలో వచ్చిన మార్పుని ఈవిధంగా చెప్పారు.

> "నడుముని వంచేస్తూ / గుండెని నలిపేస్తూ
> మానసిక ప్రపంచాలని భగ్నంచేస్తూ - కన్నీటి కడలులని సృష్టిస్తూ
> వేదన ఏదో ఉండేది - ఇప్పుడు మృత పదార్థాన్ని తోసేస్తూ
> ఆలోచన రగిలిస్తూ / వెన్నెముకను నిలబెడుతూ
> గుండెబలం కల్గిస్తూ ఈ చేతన । / అదేగదా పరిణామం
> వెచ్చని కన్నీటినుండి / వెన్నెలజాలుగ ప్రవహించును
> చిందించిన రక్తంలో ఆశయాలు చిగురించును
> గతం పునాది మీద / భావిసుందర స్వప్నంగా లేచును"

రాంమోహన్‌రాజుగారు భావపరమైన తన నిబద్ధతను ఈ విధంగా చెబుతున్నారు.

> నీ పతాకంతో లేచిన చేతులు / గత చరిత్రకు సమాధి తవ్వుతున్నాయి.
> ఆకలినుండి, పీడననుండి / కన్నీళ్ళతుడుపు వాగ్దానాలనుండినడిచి
> ఎర్రనిస్వప్నం చిగురించేదాకా సాగే / అనంత సంగ్రామంలో
> మేంఎప్పుడూనీతోనే"

## "పెసరు చేన్లో పోగొట్టుకున్న కడియం..."

వ్యాససంకలనాలు

మనం దేనికి బానిసలం

తల్లే పిల్లను చంపితే

స్త్రీవిద్య, ఉద్యోగం, వివాహం వరకట్నాలు, వితంతు వివాహాలు, విడాకులు అవివాహిత తల్లులు మొదలైన సమస్యలను "మనం దేనికి బానిసలం" సంకలనం లోని 23 వ్యాసాల్లో చాలా ఆవేదనతో ఆవేశంతో చర్చించారు రచయిత్రి మల్లాది వెంకటసుబ్బమ్మగారు. విడాకులు, ఆస్తిహక్కు, హిందూముస్లిం తదితర వివాహ చట్టాల గురించి ఎంతో సమాచారం కూడా ఈ సంకలనంలోని వ్యాసాల్లో వివరించారు రచయిత్రి

ఒక "తల్లే పిల్లను చంపితే" అన్న సంకలనంలోని 15 వ్యాసాల్లో కులతత్వం, హేతువాదం, రచయిత్రుల బాధ్యతలు, సంస్కరణవాదం, తాత్విక విప్లవం మొదలైన అంశాలతోపాటు కుటుంబనియంత్రణ గురించి (ఒక ప్రబోధగేయం కూడా) ప్రధానంగా రాశారు.

పాశ్చాత్య స్త్రీలు, లైంగిక స్వేచ్ఛ, ఆర్థిక సమానత్వం పు రు షా ధి క్య త అంటూ ఈ రెండు పుస్తకాల్లో మొత్తంమీద రచయిత్రి తడమకుండా వదిలేసిన సమస్యా లేదు సమగ్రంగా పరిశీలించి కారణాలు వివరించి పరిష్కారం కోసం నిర్దిష్ట కార్యక్రమం గురించి ఆలోచించిన విషయమూ లేదు. అసలు సమస్యల్లేవు అంతా

---

పీడించేవాడికి, పీడనను ఎదిరించేవాడికికూడా ఆయుధం ఒక్కటే- "పీడించా లన్నా కత్తేఅవసరం / పీడననెదిరించాలన్నా కత్తేఅవసరం / యుగాలుమారినా సత్యం మారదు"అని పీడనను ఎదిరించేమార్గం స్పష్టంజేశారు.

రాంమోహన్‌రాజుగారి వాక్యనిర్మాణంలో, శాబ్దికప్రయోగంలో, పదబంధాల్లో తిలక్‌ప్రభావం ఎక్కువగాఉన్నట్లు కనబడుతుంది. అయితే అదికార్బన్‌కాపీకాక పోవడం ఆయనవిశిష్టత. ఒకలక్ష్యంతో, నిజాయితీగా రాసిన వచనగేయ సంకలనమిది

– టి. ఎల్. కాంతారావు

---

రోడ్డుమీద సూర్యుడు – కవితాసంకలనం – కె. రాంమోహన్‌రాజు (ఆగస్టు 1981) పేజీలు : 36 + viii, వెల : రు. 3-00, ప్రతులకు : సృజన, హనుమకొండ, 506 001

బ్రహ్మాండంగా ఉంది అనడంకన్నా, ఏదో ఇట్లా ఉంటుంది విధిరాత ఇది తప్పదు అనడంకన్నా స్త్రీల సమస్యల్ని గుర్తించడం తమకు వీలైనపరిధిలో పరిష్కారానికి ప్రయత్నించడం అభ్యుదయకరమే అయినప్పటికీ స్త్రీలసమస్య కారణం వివరించ డంలో రచయిత్రి వేసిన తప్పటడుగు "పెసరుచేన్లో పోగొట్టుకొన్న కడియాల్ని పప్పటికెలో వెతుకు దొరుకుతాయి" అని సలహాఇచ్చినట్లు ఉంది. ఈ ఆలోచనావిధానం సహజంగానే స్త్రీల సమస్యలకి సూచించిన పరిష్కారాల్లో కూడా ప్రతిబింబించింది.

"పురుషాధిక్యత" వంటి పదాల చారిత్రిక పరిణామక్రమం గురించి స్పష్టంగా తెలిసే మాట్లాడారా (రాశారా) అనే సందేహం కలుగుతుంది వ్యాసాల్లో రచయిత్రి వెల్లడించిన కొన్ని అభిప్రాయాల్ని చదివితే. మనది పురుషాధిక్య సమాజం పురుషునికి స్త్రీ బానిస అంటూనే "ఏపాపమెరుగని అతనిని (పురుషుని) అల్లరిపాలుచేయడం పాడి కాదు" (మనం దేనికి బానిసలం పేజీ 60) అని స్త్రీలకి బుద్ధులు చెప్పుతారు కుటుంబ కలహాలకు వెనుకగల ఆర్థిక సాంఘిక అసమానతల్ని పురుషాధిక్యతకి కారణం వాటిని పరిష్కరించకుండా స్త్రీలకు బుద్ధిగా ఉండండి అని సలహాలిస్తే లాభంలేదు అని రచ యిత్రి గుర్తించడం లేదు ఇక్కడ. అందుకే అత్తకోడల్ని కూతురిలా చూసుకోవాలి కోడలు అత్తని తల్లిలా చూసుకోవాలి అని అత్తాకోడళ్ళ హృదయాల పరివర్తనకి ప్రబో ధిస్తారు సంస్కరణవాదాన్ని ప్రత్యేకంగా ఒక శీర్షిక కింద విమర్శించిన సుబ్బమ్మ గారు (తల్లే పిల్లను చంపితే పేజీ 32)

"మనం సమాజానికి బానిసలం, సాంప్రదాయానికి బానిసలం, పురుషాధిపత్యా నికి బానిసలం, అంతేకాదు సాంఘిక, ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో స్త్రీకి సమానత్వంలేదు. ముఖ్యంగా భర్తలకు కుటుంబానికి స్త్రీలు బానిసలుఅని నాభావం. స్త్రీకి వ్యక్తిత్వంలేదు. వ్యక్తిస్వేచ్ఛాలేదు. బానిసను డబ్బుఇచ్చికొంటారు. కానీ కట్నంరూపేణా డబ్బుఇచ్చి స్త్రీ బానిసత్వంలోకిపోతుంది" (మ. దే.బా.-5) అనిఎంతో ఆవేదనచెందిన సుబ్బమ్మగారు అదేపుస్తకానికి ముందుమాటలో డా॥ వీణాశత్రుఘ్న వివరించిన "స్త్రీ పరాజయగాధ"ను అర్థంచేసుకోకుండా "అసలీఅసమానత్వాన్ని స్త్రీలే పెంచిపోషిస్తున్నారన్నా తప్పులేదు. అనేకమంది స్త్రీలు తమకుమాత్రెలకు కట్నం ఇచ్చుట, కుమారులకు పుచ్చుకొనుటలో ప్రముఖపాత్ర వహిస్తున్నారు. వారి (స్త్రీలు) అభివృద్ధి నిరోధకత్వానికి (తమని మినహాయించుకొని) వారే కారణమనడంలో సందేహంలేదు" (మ. దే. బా. 23) అని తేల్చేసారు, స్త్రీలపై పరమచికాకుపడుతూ.

అయితే ఇందుక్కారణం "చట్టాలెన్నివచ్చినా, సంస్కరణలెన్నిజరిగినా పితృ స్వామ్య వ్యవస్థలోని ఆచార సాంప్రదాయాలామెను బానిస మనస్తత్వంనుంచి మార్చ లేకున్నవి" (మ దే. బా. 24) అని ఓమేరకు సమస్య స్వభావాన్ని గుర్తించినప్పటికి "విశ్వవిద్యాలయాల్లో, శాసనసభల్లో, స్త్రీలకు ప్రత్యేకకోటా (రిజర్వేషన్లు) కేటా యించాలి" అంటూ ఈ వ్యవస్థపరిధికి (పితృస్వామ్యం) లోబడి పరిష్కారాన్ని సూచి స్తారు. రిజర్వేషన్లు స్త్రీవిముక్తికి రోడ్డువేసేటట్లయితే ప్రస్తుతం ఆ కేటాయింపులు ఓ మేరకు ఉండనేఉన్నాయి (ఆఖరికి అంజయ్యగారు మున్సిపల్ఎన్నికల సందర్భంగా ఆడవాళ్ళకి విడిగా బస్సులు వేశారు) కొంతమందిస్త్రీలు అధికారయంత్రాంగంలోనో, శాస నాలు రూపొందించడంలోనో భాగస్వాములయినంత మాత్రాన స్త్రీవిముక్తి సిద్ధించేటట్ల యితే ఒక స్త్రీ ప్రధానికిఉన్న ఈ దేశంలో రమేజా, షకీలా, మాయాత్యాగీలకు కనీస న్యాయం జరగనిపరిస్థితి ఎందుకుఉందో సుబ్బమ్మగారు అర్థం చేసుకోలేదనిపిస్తుంది. స్త్రీలపై అణచివేతకుగల పరిస్థితుల మౌలికస్వభావాన్ని అర్థంచేసుకోక పోవడంవల్లనే సుబ్బమ్మగారు తమ వ్యాసాలన్నింటిలోనూ పరస్పరవిరుద్ధభావాల్ని ప్రకటించారు. "ఈ సంస్కరణలు అవశ్యకమేకానీ వీటిపరిధి పరిమిత ప్రయోజనం విషయంలో ఇరుతెగలకు (సంస్కరణవాదులకి తమవంటి సామాజిక విప్లవకారులకి) భేదాభిప్రాయం ఉన్నది. తాత్కాలిక కార్యక్రమాలకు అంకితమైపోతారు సంస్కర్తలు. సమగ్రమైన సమ్యక్ దృక్పథాన్ని కల్గిఉంటారు సామాజిక విప్లవకారులు" (తల్లి పిల్లనుచంపితే పేజీ 34) అని విమర్శిస్తూ మరోపక్క ఇదేపుస్తకంలో "ఈనాడు సంఘం, చట్టం పురుషులు స్త్రీలకు స్వేచ్ఛా సమానత్వాలిచ్చినా స్వీకరించేస్థితిలో స్త్రీలున్నారా? అనేదిప్రశ్న స్త్రీ జనాభ్యుదయానికి చట్టాలెన్నిఉన్నా (ఏమేరకుఉన్నాయో?) పురుషాధిక్యతల సమాజంమనది. స్త్రీలపట్ల పురుషులదృక్పథం మారనిదే ప్రభుత్వ ఆర్డినెన్స్‌గానీ చట్టాలచేగానీ మార్పుకోరుట అనూహ్యం, అసమంజసం, స్వేచ్ఛా సమానత్వం, సాంఘికన్యాయం, ఆత్మవిశ్వాసం స్త్రీలపరంకావాలంటే పురుషుల సహకారం అవ సరం" (తల్లేపిల్లనుచంపితే పేజీ 37) అంటారు. ఈ రకమైన అవగాహనాలోపం ఎంతవరకు వెళ్ళిందంటే పాశ్చాత్యదేశాల్లో స్త్రీలపరిస్థితుల్ని బ్రహ్మాండంగా పొగడ్డం దాకా వెళ్ళింది. "పాశ్చాత్య స్త్రీలు ప్రేమించిపెళ్ళిచేసుకొంటారు. ఇండియాలో కట్నం సంగతిపని అమెరికన్ స్త్రీలు చకితులయ్యారు.... రైళ్ళలో బస్సుల్లో స్త్రీలకు ప్రత్యేకంగా సీట్లుకేటాయించరు ... బార్‌లలో కేఫ్‌లలో సమానసంఖ్యలో స్త్రీలు కన్పిస్తారు. పానీయాలుపుచ్చుకొంటూ.... నీతులుచెప్పరుకానీ పాటిస్తారు. వంటలో

సైతం పురుషులు పాల్గొంటారు" అంటూ మహదానందంగా వర్ణించి అమెరికన్ సమాజంలో స్త్రీలపరిస్థితి గొప్పగా ఉందేమోనన్న భ్రమల్ని కల్పిస్తారు పాఠకులకి. దేశాలు చట్టాలు గురించి ఎన్నో విషయాలు చర్చించిన రచయిత్రికి ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో మానభంగాలుజరిగేది అమెరికాలో నేనన్న విషయం తెలియదా? తెలిస్తే ఎందుకిల్లా పరస్పర విరుద్ధభావాలు, అస్పష్ట పరిష్కార మార్గాలుచెప్పి తనే కాదు పాఠకుల్ని గందరగోళంలో పడేవిధంగా రాయడానికి కారణంఏమిటి?

"మహిళలు ఈ కట్టుబాట్లు తెంచుకొని- తమ వ్యక్తిత్వాన్ని నిల్పుకొని ప్రగతి పథంలోకి పయనించే దెప్పుడో? అన్న జిజ్ఞాసే ఈ సంకలనానికి ప్రోద్బలం" అని 'మనవి'చేసుకొన్న రచయిత్రి జిజ్ఞాస స్త్రీపరాధీనత పుర్వాపరాలు, చారిత్రిక పరిణామ క్రమంలోకి వెళ్ళకుండా రాడికల్ హ్యూమనిజం (నవ్యమానవతావాదం) దగ్గర ఆగి పోవడమే ఇందుకు కారణం పుస్తకాల వెనక అట్టమీద రచయిత్రి గురించి తెలిపిన వివరాల్లో మహిళాఉద్యమ కార్యకర్త, అభ్యుదయమహిళా సంఘం అధ్యక్షురాలైన సుబ్బమ్మగారిని రాడికల్ హ్యూమనిస్టు సంఘం కార్యదర్శి హేతువాద సంఘఉపాధ్యక్షు రాలు కుటుంబనియంత్రణ ప్రబోధకురాలు హ్యూమనిస్టు ఉద్యమ సంచాలకురాలైన సుబ్బమ్మగారు పూర్తిగా డామినేట్ చేసింది. హేతువాదం హ్యూమనిజం, నవ్యమానవతా వాదం (రాడికల్ హ్యూమనిజం) అని ఎన్ని పేర్లు పెట్టుకొన్నా శాస్త్రీయ దృక్పథాన్ని మైనస్ చేసుకొన్న మానవతావాద (మానవత్వం - మానవతకాదు) రూపాలే అందుకే సుబ్బమ్మగారు విప్లవం పురుషాధిక్యత, పితృస్వామ్యం ఆస్తిహక్కులు అంటూ ఎన్ని చెప్పినా, సంస్కరణవాదాన్ని ఎంత ఏకినా, చివరికి తానూ సంస్కరణలు, సహకారాలు, రాయితీల దగ్గరే ఆగిపోతారు- స్త్రీవిముక్తికి తమ కార్యక్రమం ప్రణా ళిక సూచ్యప్రాయంగానైనా చెప్పరు- నిర్దిష్ట కార్యక్రమాన్ని ప్రతిపాదించలేక పోయారు. ఏ సిద్ధాంత పరిధికి లోబడి సుబ్బమ్మగారు స్త్రీవిముక్తికి పరిష్కారం వెతికారో ఆ రాడికల్ హ్యూమనిస్టు 22 సూత్రాల్లో సహకార సంఘాలు, రాయితీలు శాస్త్రీయత పేరుతో సంస్కరణలు తప్ప, స్త్రీవిముక్తికిగానీ మరే మౌలిక సామా జిక సమస్యలకుగానీ నిర్దిష్ట పరిష్కారమార్గం, కార్యక్రమం అంటూ లేవు.

18 శతాబ్దిలోనో 19 శతాబ్ది మొదటిభాగంలో సంస్కరణలు ఏరంగానికి సంబం ధించి అయినా అభివృద్ధికరపాత్ర నిర్వహించినమాట నిజమే. కానీ దేశంలో ఓపక్క వర్గచైతన్యంతో పీడితప్రజలు పోరాటరంగంలోకి వస్తున్నదశలో ఏసమస్యకైనా రాయితీలు, సంస్కరణలు అభ్యర్థనలు వెనుకడుగుతప్ప ముందడుగుకావు. ఈ

సమీక్ష :

# ఊహల 'ఉప్పెన'లో కొట్టుకుపోయిన చరిత్ర

ఒకానొక చారిత్రికదశకు సంబంధించిన సామాజిక పరిస్థితికి, పరిణామానికి కళారూపం ఇవ్వబూనుకోవడం ఒక సాహసం. ఈ ప్రయత్నంలో రచయితలకు నాటిదేశ, కాలపరిస్థితులపట్ల సంపూర్ణమైన అవగాహనా, నాటి సంఘజీవన విధానంతో లోతైన పరిచయమూ, జీవితానుభవమూ ఉంటే ఈ సాహసం సఫలమవుతుంది. రాయదలచుకున్నకాలంనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల గురించి స్పష్టమైన, అవసరమైన అవగాహన లేకుండాపోతే ఆ రచన చరిత్రను సరిగా చిత్రించలేకపోవడమేగాక తప్పుగా చిత్రిస్తుంది. ఆ చారిత్రిక దశ ప్రత్యేకించి పోరాటానికి, జనజీవన సంఘర్షణకు సంబంధించినదైనప్పుడు రచయితకు దానిలో గాఢమైన అభినివేశం ఉండవలసిన అవసరం ఉంది.

సరిపల్లి కృష్ణారెడ్డి నవల 'ఉప్పెన' చదివితే రచయితకు తాను రాయదలచుకున్న విషయంగురించి ప్రాథమిక పరిజ్ఞానమేతప్ప స్పష్టమైన అవగాహనలేదని అర్థమవుతుంది. ఒకచరిత్రాత్మక పోరాటాన్ని చిత్రించదలుచుకున్న నవలారచయితకు ఆ పోరాటపు కాలక్రమం, ఆ ప్రాంత సాంఘిక, ఆర్థికపరిస్థితులు, ఆపోరాటంలో

---

చైతన్యంతోనే డా॥ వీణాశత్రుఘ్న ముందుమాటలో చూపించినట్లుగా సాంఘికార్థిక లైంగిక దౌర్జన్యాన్ని స్త్రీలు సమిష్టిగా ఎదుర్కొంటేనే జనాభాలో సగభాగమైన స్త్రీజాతికి ఉద్ధరించుకోగలరు. అణగారిన ప్రజానీకంగా స్త్రీలు దోడిడీకి గురిఅవుతున్న కార్మికులలో కర్షకులలో సమిష్టికృషి సాగించాలి. కానీ ఈపని ప్రారంభించేముందు మన బలహీనతలను మనం గుర్తించాలి. అన్నింటికన్న మిన్నఅయిన అసౌకర్యం ఏమంటే మనం వేరువేరుగా ఉంటున్నాం. ఏ సంఘటితసంస్థ కావాలన్నా నలుగురు ఒక్కచోటచేరాలి. ఇదిచాలా బ్రహ్మాండమైనపని. ఇళ్ళల్లోంచి బయట అడుగుపెడ్తే కుటుంబంనుంచి, సమాజంనుంచివచ్చే తృణీకారాన్ని వ్యతిరేకించాలి. ఏమైనా వాళ్ళలోంచి వెలికివచ్చి ఒకరినొకరు స్త్రీలు కలిసి కూడి సంఘటిత ఉద్యమాన్ని నిర్మించుకోవాలి" అన్నమార్గాన్ని సుబ్బమ్మగారు అర్థంచేసుకొంటేనే స్త్రీల సమస్యల పట్ల ఆమె చెందుతున్న ఆవేదనకి నిజమైన పరిష్కారం లభిస్తుంది.

\- రత్నమాల

---

మనం దేనికిబానిసలం ? వ్యాసాలు – మల్లాది వెంకటసుబ్బమ్మ, ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై)లిమిటెడ్ ప్రచురణ (1980) పేజీలు 72+xvi, వెల రు. 3-50

తల్లేపిల్లను చంపితే ? వ్యాసాలు – మల్లాది వెంకటసుబ్బమ్మ ప్రతులకు : సరళా పబ్లికేషన్స్, తెనాలి.

---

వివిధశక్తుల భాగస్వామ్యం, వాటిప్రయోజనాలు, పోరాటాన్ని వ్యతిరేకించిన శక్తులు, చివరికి పోరాటప్రాంతపు భాషా సంస్కృతుల గురించికూడా లోతైనపరిజ్ఞానం లేక పోవడం విచారకరం.

తెలంగాణలోని ఒకగ్రామంలో దొర పుణ్యమూర్తి. చిన్నరైతు వెంకటరెడ్డి కొత్తగా కొనుక్కొచ్చుకున్న ఎడ్లజతమీద దొర కన్నుపడుతుంది. డబ్బివ్వకుండానే ఎద్దులను అమ్మినట్టుగా కాయిదం రాయించుకొని ఆఎడ్లను స్వంతం చేసుకుంటాడు- చివరికి వెంకటరెడ్డిని కొట్టి స్పృహలేనిస్థితిలో గడీబయట పడవేయిస్తాడు. ఆ ఊళ్ళోనే ఇంకో చిన్నరైతు మోహనరెడ్డి. ఆయనకొడుకు ఓబుల్‌రెడ్డి- మోహనరెడ్డి ఎప్పుడో అవసరానికి తీసుకున్న బాకీ చెల్లవేసినా పుణ్యమూర్తి నోటుమీద వసూలుపెట్టడు- వెంకటరెడ్డిపై చేయనినేరం ఆరోపించి పంచాయితీలో జుర్మానావిధిస్తాడు. ఈ అన్యాయాలు యువకుడైన ఓబుల్‌రెడ్డిలో ఆలోచనలు రగిలిస్తాయి. తనలాంటి యువకులను కూడగట్టే ప్రయత్నంలో పడతాడు- దొర దౌర్జన్యానికి గురైన నిర్మల బావిలోదూకి చనిపోతుంది- అమీన్ ఊళ్ళోకివచ్చి వెంకటరెడ్డి కుటుంబాన్ని, జనాన్ని బెదిరించిపోతాడు ఈ పరిస్థితుల్లో ఓబుల్‌రెడ్డికి పేటకుపోవలసిన పనిబడుతుంది. అక్కడ యాదృచ్ఛికంగా సంఘనాయకుడు ప్రతాప్‌కలుస్తాడు- పోలీసు దౌర్జన్యాన్ని స్వయంగా అనుభవిస్తాడు- ఊళ్ళోదొర కొట్టినదెబ్బలకు వెంకటరెడ్డి చనిపోతాడు- వెంకటరెడ్డి చావు ఊరేగింపులో ఓబుల్‌రెడ్డి కొత్తగానేర్చుకున్న నినాదాలు జనమంతా అందుకుంటారు- వెంకటరెడ్డికూతురు కళ్యాణికీ, ఓబుల్‌రెడ్డికీ మనసులుకలుస్తాయి- ప్రతాప్‌తో, ఓబుల్‌రెడ్డికీ సంబంధాలు పటిష్ఠమవుతాయి. ఓబుల్‌రెడ్డిని ప్రతాప్ ఒకనాడు ఆయుధస్థావరానికి తీసుకవెళ్ళి కామ్రేడ్ సిన్హాను పరిచయంచేస్తాడు- గ్రామంలో ఒక చిన్నపాటి సమావేశంపై పుణ్యమూర్తి మంట్లు దాడిచేస్తారు- అదాడిని ప్రజలంతా తిప్పికొడతారు. ఓబుల్‌రెడ్డి దళంలో చేరి దళనాయకుడవుతాడు. పుణ్యమూర్తి గ్రామంపై రజాకార్లతో దాడిచేయిస్తాడు- ఆ దాడినుంచి తప్పించుకొన్న కళ్యాణి దాడిపరించి దళానికి తెలియజేస్తుంది- దళం రజాకార్లమీద దాడిచేసి వాళ్ళను తరిమికొడుతుంది- మళ్ళీకొన్నాళ్ళకి రజాకార్లు గ్రామంమీద పెద్దఎత్తున దాడిచేస్తారు- కళ్యాణితల్లి, మోహనరెడ్డి, మరెందరో హతమవుతారు. కళ్యాణిని పుణ్యమూర్తి చెరుస్తాడు. ఈ విషయాలువిన్న ఓబుల్‌రెడ్డి ఎవరూతోడులేకుండ గ్రామానికి బయలుదేరి పోలీసుల చేతచిక్కుతాడు. ఒక నాటకీయ సన్నివేశంలో పోలీసులచేతినుంచి తప్పించుకుంటాడు. ఈలోగా ప్రతాప్ విషజ్వరంవల్ల మరణిస్తాడు- సిన్హాను ఆంధ్రలో పట్టుకొని కాల్చివేస్తారు. రజాకార్లు, పోలీసులు చివరిసారి పెద్దఎత్తున దళంమీద దాడిచేస్తారు- ఆ దాడిలో

విజయం సాధించిన ఆనందంలోఉండగానే దళాన్ని లొంగిపొమ్మంటూ యూనియన్ సైన్యాలు హెచ్చరిస్తాయి. పోరాటం ఆపొద్దని ఓబుల్‌రెడ్డి సందేశమిస్తాడు. 'సూర్యుడు పడమటి కొండల్లోకి జారిపోతూఉండగా' నవల ముగుస్తుంది– స్థూలంగా 'ఉప్పెన' కథ ఇది.

సంభాషణలనుబట్టి నవల 1948 మార్చ్/ఏప్రిల్‌లో ప్రారంభమై సెప్టెంబర్‌లో ముగిసినట్లు తెలుస్తున్నది. కథ ప్రారంభమయిన నాలుగయిదు రోజులకే 'ఫాల్గుణ మాసం చొరబడింది' (పే. 33) అనడం; అప్పుడే 'యావత్‌దేశానికి స్వాతంత్ర్యం వచ్చింద'నడం వల్ల 1947 ఆగస్టు తర్వాత ఫాల్గుణమాసం అంటే ఈ నవల 1948 మార్చ్/ఏప్రిల్‌లో ప్రారంభమైందనుకోవచ్చు. యూనియన్ సైన్యాల ప్రవేశంతో నవల ముగుస్తుంది అంటే నవలా కథ 1948 సెప్టెంబర్‌తో ముగుస్తుందన్నమాట. [మధ్యలో ఎండాకాలంపోయి వర్షాలు పడింతర్వాత జ్యేష్ఠం రావడం రచయితకు కాలాల గురించి పరిజ్ఞానం లేదనడానికి గుర్తు.] ఇక్కడ నవల కథాకాలాన్ని గురించి ఇంత వివరంగా ఎందుకు చర్చించవలసి వచ్చిందంటే 1940 నుంచి 1948 దాకా ఎనిమిది సంవత్సరాల కాలపు తెలంగాణ జనజీవనాన్ని – సంఘనిర్మాణం నుంచి కాంగ్రెస్ సైన్యాల ప్రతిఘటన దాకా – దాని అన్ని దశలతో ఈ ఏడునెలల్లోనే చెప్పడానికి రచయిత విఫలయత్నం చేశారు. ఆ ప్రయత్నం విఫలంకావడమేగాక కొన్ని చోట్ల వ్యతిరేక ఫలితాలివ్వడానికి కూడా దారితీసింది.

నిజానికి 1947 ఆగస్టు 15 నుంచి 1948 సెప్టెంబర్ 13 దాకా తెలంగాణ పోరాటదశ భూపంపకం, ప్రజారాజ్య స్థాపనలదశ; నైజాంరజాకార్ వ్యతిరేక సాయుధ ప్రతిఘటనాదశ; ఆయుధసేకరణ, గెరిల్లాదళ నిర్మాణ దశ.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో సాగిన చరిత్రాత్మక పోరాటాన్ని చిత్రించ దలచుకున్న ఈ నవలలో వ్యక్తుల గొప్పతనమూ, వ్యక్తిపూజా, వ్యక్తుల స్వంత నిర్ణయాలూ, వ్యక్తిగతచర్యలూ తప్ప పార్టీ నిర్మాణమూ, పార్టీ ఆలోచనా విధానమూ, పార్టీక్రమశిక్షణా ఎక్కడా కనబడవు. పార్టీ అభాసపచ్చేట్టుగా చిత్రించిన కొన్ని అంశాలు కూడా ఆయా అంశాలపట్ల రచయితకు అవగాహన లోపించడంతో మాఫియాకు సరిపడిన అంశాలుగా చిత్రించబడ్డాయి.

ఆయుధాలు తయారుచేయడం, భద్రపరచడం మొదలైన పనులు కమ్యూనిస్టు పార్టీ అడవుల్లో, కొండగుహల్లో మాత్రమే చేస్తుందని రచయితకు తప్పుడు అభిప్రాయం ఉంది. [ఈ నవల సిమాతిస్తే 80వ పేజీలో ఆయుధస్థావరాన్ని వర్ణించినట్టేస్తే

మంచిక్రైం సినిమా సన్నివేశం తయారవుతుంది]. నిజానికి ఆకాలంలో ఆయుధాలు శత్రువుల నుంచి గుంజుకోవడం ద్వారానే సేకరించడంజరిగింది. ఆకాలంలోనే దళ నిర్మాణం జరిగింది. గ్రామదళాలు, నిర్మూలనదళాలు, గెరిల్లాదళాలు అని దళాలు మూడురకాలుగా ఉండేవి. రచయిత ఊహించినట్టు ఆయుధాలు కొండగుహల్లోకాక ఈ దళాల చేతుల్లో ఉండేవి.

ఆ పోరాటకాలంలో సిన్హాలాంటి పేర్లు పెట్టుకున్నారనడానికి ఆధారాలేమైనా ఉన్నాయా ? అప్పటి పార్టీనిర్మాణం చాలా మామూలుగా అందరికీ తెలిసినదిగానే ఉన్నది. వచ్చీరాని తెలుగు మాట్లాడడం ఎవరినుంచి దాగిఉండడానికి ? "వేషభాషల్లో మీకూ స్థానిక ప్రజలకూ మధ్య ఎలాంటి తేడా ఉండగూడదు" అని అప్పటి పార్టీ రాష్ట్ర కమిటీ 1949 మే 14 నాటి టెక్నికల్ సర్క్యులర్‌లో రాసింది. ఆసర్క్యులరే చాలా ఆశ్చర్యంగా "ఇంతవరకూ మీరు మీ కార్యకలాపాలన్నిటినీ బహిరంగంగా సాగించటానికలవాటుపడి ఉన్నారు" అని రాసింది. సరిపల్లి కృష్ణారెడ్డిగారి పాత్రలు మాత్రం పార్టీ ఆదేశం కంటె ముందే పేర్లు ఎవరికీ తెలియకుండా దాచి ఉంచుకున్నాయి; వచ్చీరాని తెలుగు మాట్లాడాయి.

అప్పటికే పేటలోని యువజన సంఘంలో ముఖ్యుడుగా ఉండి, ఆ సంఘం ఆంధ్రమహాసభలో కలిసిపోయిన తర్వాత పేట కార్యదర్శిగా ఎన్నుకోబడిన ప్రతాప్ ఎన్నోచోట్ల పార్టీ అవగాహనేమీ లేనివాడుగానే కనబడతాడు. 1944 తర్వాత కమ్యూనిస్టుపార్టీకి పర్యాయపదంగా మారిపోయిన ఆంధ్రమహాసభకు ఒక ప్రాంతానికి కార్యదర్శిగాఉన్న ప్రతాప్‌కు కమ్యూనిస్టు అవగాహన లేకపోవడం ఆశ్చర్యకరం.

ప్రజా చైతన్యంతో సంబంధం లేకుండా, ఆకాలపు ప్రజా చైతన్యంపరిణామ క్రమం అర్థంచేసుకోకుండా వ్యక్తులచుట్టూ కథ నడుపుదామనుకోవడంవల్ల రెండుచోట్ల గ్రామ ప్రజానీకమంతా తిరగబడినా, గ్రామంలో సభజరిగినా నవల పూర్తయేసరికి ప్రజాచైతన్యంలో ప్రగతిశీల పరిణామమేమీ కనబడదు,

తెలంగాణ సాయుధపోరాటం భూమి, భుక్తికోసం సాగిన పోరాటం. చివరి దశలో విముక్తి పోరాటం. ఈ పోరాటం గురించి రాసిన నవలలో ఎక్కడా భూమి సమస్య ఎత్తుకోబడలేదు. భారతదేశంలో ప్రతి ప్రజాసమస్యా భూమిచుట్టే తిరుగుతుంది. నైజాంపాలనలో భూమి సమస్యే రైతాంగ పోరాటాన్ని రగిల్చింది.

"ప్రజాచైతన్యానికి ఇరుసు భూమిసమస్య". భూమిసమస్యను పట్టించుకోకపోవడమంటే తెలంగాణ విమోచనోద్యమపు ప్రాణప్రదమైన అంశాన్ని నిరాకరించ

డమే. భూస్వామిచేసే చిల్లరదోపిడీలు, దొంగతనాలు, సెక్సుదౌర్జన్యాలు, పెత్తందారీ తనంతప్ప నాటి దొరలుచేసిన దౌర్జన్యంగానీ, భూమిసమస్యలుగానీ నవలలో ప్రస్తావనకురాలేదు.

భాగ తెలంగాణపోరాటం స్పష్టంగా భూస్వామ్య వ్యతిరేకపోరాటం. దానిలో మత ప్రసక్తిలేనేలేదు- అయితే ఈ నిజాంవ్యతిరేక పోరాటాన్ని ముస్లిం వ్యతిరేక పోరాటంగా చిత్రించడానికి ఆర్యసమాజ్, కాంగ్రెస్, హిందూమహాసభ ఎంతో ప్రయత్నించాయి- ప్రచారం చేశాయి. రాజ్యం ముస్లిం రాజ్యంఅని కమ్యూనిస్టుపార్టీ ఎన్నడూ భావించలేదు. దొరల, భూస్వాముల, దేశముఖుల, వాళ్ళను కాపాడుతున్న ఫ్యూడల్ ప్రభువుల దోపిడీకోరల్లో చిక్కుకుపోయిన రాజ్యాన్ని విముక్తిచేద్దామని పోరాటం తలపెట్టింది. ఇది ముస్లిరాజ్యమని, ముస్లిమైన ప్రతివాడూ ప్రభువేనని, హిందువులకు స్థానంలేదని ఇత్తెహాదుల్ ముస్లమీన్ ప్రచారంచేసింది. ఈ రెండురకాల విష ప్రచారాలనూ దాటుకొని హిందూముస్లిం పీడిత ప్రజానీమంతా పీడకులమీద పోరాటం సాగించారు- రచయితమీద ఈ విషప్రచారాల ప్రభావం ఉండడంవల్ల నవల ముస్లిం వ్యతిరేకతను ప్రతిబింబిస్తున్నది.

రచయిత అభిప్రాయంలో పీడితుల తిరుగుబాటుఫలితమే హింస. ఆయన వాక్యాల్లోనే చెప్పాలంటే "ఉన్నవాడు లేనివాణ్ణి ఎప్పుడూ కాలికింద మట్టిలాగ అణిగి ఉండాలంటాడు- కాని ఒక్కసారి ఆ కాలికిందమట్టే కళ్ళలోపడితే ఎంతోబాధపుడుతుంది- ఎప్పుడూ ఇతరులమీద అత్యాచారం సాగిస్తుంటే ఎప్పుడో ఒకప్పుడు ఎవడో ఒకడు ఎదిరించకతప్పదు- అప్పుడు సంఘంలో పెద్దమనిషిగా పేరొందిన ఆడబ్బున్న పెద్దమనిషి వాణ్ణి అణచడానికి ప్రయత్నంచేస్తాడు. అప్పుడే ఇరుపక్షాల పోరులో హత్యలు జరుగుతాయి- హింసజరుగుతుంది" (పే. 20)- హింస "అప్పుడే" జరగదు అసలు హింసనెవడు అమలుచేస్తున్నాడు? మట్టికాలుకింద ఉండడమేహింస- అది ఎగిరొచ్చి కళ్ళలో పడడంతోనే హింస ప్రారంభంకాదు, ప్రతిహింస ప్రారంభమవుతుంది.

రచయిత తానెన్నుకున్న ప్రాంత ప్రజానీకపు భాషాసంస్కృతులనుకూడా సరిగా అధ్యయనం చేయలేదు.

పుణ్యమూర్తి అనేపేరు నలభై ఏళ్ళకింద తెలంగాణలోఉందా? అంటే డెబ్బై ఎనభై ఏళ్ళకింద తెలంగాణలో అలాంటిపేరు పెట్టారా?

"తెలుగుమాట్లాడినా సగానికిపైగా ఉర్దూపదాలే"అని ముందుమాటలో కాంక్షన్ చేసుకొని అయినచోటా కానిచోటా రచయిత ఉర్దూపదాలువాడారు. ఉర్దూ పాలకుల

భాషగా పట్టణప్రాంతాల్లో, గ్రామీణప్రాంతాల్లో వేరు వేరు ప్రభావాలు వేసింది. గ్రామీణ ప్రాంతాల్లో రెవెన్యూ, తదితర బాహ్యప్రపంచంతో సంబంధంఉండే పారి భాషిక పదాల్లో ఉర్దూ ప్రవేశించింది. పట్టణప్రాంతాల్లో నిత్యవ్యవహారికపదాల్లో, మార్కెట్‌కు సంబంధించిన పదాల్లో ఉర్దూ వ్యాపించింది- ముఖ్యంగా నేరప్రపంచపు పరిభాషనిండా ఉర్దూ అల్లుకుపోయింది. దాదాపు తిట్లన్నీ ఉర్దూతిట్లే అయిపోయాయి, ఈ సంస్కృతి జీర్ణించుకపోయిన పోలీసు అధికారులతోనూ, నిజాం ప్రభుత్వ ఉద్యోగులతోనూ, వాళ్ళను అనుకరించజూసే దొరలతోనూ ఈ తిట్లు గ్రామీణ ప్రజలకు పరిచయమయ్యాయి. కాని 'బాడుకావు, బే' లాంటితిట్లు అప్పటితెలంగాణలో గ్రామీణప్రాంతాల్లో వాడుకలోఉన్నాయా? అదీ బాసుకావు పదాన్ని గ్రామీణ స్త్రీ ఉప యోగించడం ఎక్కడైనాఉందా? చీపురును ఝాడుకట్టెఅనడం హైదరాబాద్ శివారు ప్రాంతాల్లోతప్ప తెలంగాణగ్రామాల్లో మరెక్కడైనా ఉందా?

'తెలంగాణ మాండలిక భాషా విలక్షణాన్ని ఎత్తిచూపేందుకు ప్రయత్నించారు' అని చెప్పిన రచయిత మాండలికంలో ఉండే జీవాన్ని, జిగినీ ఖూనీ చేశారు. మనం మాట్లాడుకునే ప్రతి వాక్యమూ ఒక ప్రత్యేక నిర్మాణంలోనే ఉంటుంది. మాటల్లో ఏ వాక్యనిర్మాణ సూత్రాన్ని పాటించకపోవడమే ఈ నవలలోని పాత్రల ప్రత్యేకత

'అరవడం' అనే క్రియాపదం ఎందుకు ఉపయోగిస్తారో కూడా తెలియకుండా నవలా రచనకు పూనుకోవడం ఘోరం (పేజీ 11 "దండాలు దొరా" పెద్దగా అరి చాడు ఓబుల్‌రెడ్డి తండ్రి.)

'హృదయం పొంగింది' అనే ప్రయోగం ఆనందాన్ని సూచించడానికే వాడ బడుతున్నది కాని బాధను సూచించడానికి కాదని రచయిత తెలుసుకుంటే బాగుండును. ("చావు సంగతివిన్న ఓబుల్‌రెడ్డి హృదయం పొంగిపోయింది" పే. 44-45)

నవలలో గ్రామం పేరు 'తెలుగునాడు' అనిపెట్టడం, ముస్లిం వ్యతిరేకత, పోరాటనాయకత్వంలాంటి కొన్నిఅంశాల్లో గొల్లపూడి నారాయణరావు 'తెలుగుగడ్డ' ఛాయలు కనబడుతున్నాయి.

నవలలో చాలాసన్నివేశాలపై ప్రేమ్‌చంద్ 'గోదాన్' ప్రభావంఉంది. 'గోదాన్‌లో'లో 85-86 పేజీల్లో సంభాషణలకు, ఈ నవలలో 31-32 పేజీల్లో సంభా షణలకు తేడాలేకపోవడం యాదృచ్ఛికమే అంటే ఆశ్చర్యకరం. 143-145 పేజీల్లో వర్ణించబడ్డ సైన్యాలపైదాడి తెలుగుగడ్డ నవలలో 391-394 పేజీల్లో వర్ణించబడ్డ సంఘటనలాగే ఉండడంలోకూడా 'తెలుగుగడ్డ' ఛాయలు కనబడుతున్నాయి.

"ఈ నవల ఆంధ్రజ్యోతి పత్రికలో.... సీరియల్‌గావచ్చింది. పత్రిక అవసరాలను పురస్కరించుకొని వారు కొన్నిభాగాలను పూర్తిగా అచ్చువేయలేదు. ఆ భాగాలలో ఉచితమని తోచినవాటిని పుస్తకంలో మళ్ళీచేర్చాను. అంతేకాక ఇప్పటి పత్రికలో మరికొన్ని మార్పులుకూడా చేశాను...." అని ముందుమాటలో రాశారు రచయిత. దీన్నిబట్టి రచయిత పత్రికలకూ, ప్రచురణకర్తలకూ ఎవరికి తగినట్టుగా వాళ్ళకు రాయగలడని, బలమైన కన్విక్షన్‌గానీ, అవగాహనగానీ లేవని స్పష్టమవుతున్నది. ఇది అవకాశవాదం. ఆంధ్రజ్యోతిలో అచ్చుకోసం పోరాటాన్ని విరమింపజేయడం, ఎచ్‌బిటి లో అచ్చుకోసం పోరాటాన్ని కొనసాగించడంతప్ప పోరాటాన్ని దాని సజీవరూపంలో ఒక చారిత్రిక యదార్థంగా దాని గతితార్కిక స్వభావంతో చిత్రించాలనే జ్ఞానం రచయితకులేదు పోరాటం కొనసాగుతున్నదనే మార్పుచేసినంతమాత్రాన సంతృప్తిపడి ఈపుస్తకం ప్రచురించడం 'సాంఘిక ప్రయోజనాత్మకమైన సాహిత్యాన్ని ప్రచురించాలనే ధ్యేయంతో అవతరించిన హైదరాబాద్ బుక్‌ట్రస్ట్‌కుమాత్రం తగదు కనుక "సాయుధపోరాటానికి సంబంధించిన విషయాలను" విన్నప్పుడు కలిగిన "స్పందన"కు "ఊపిరిపోయడం"లో రచయిత న్యాయం చేకూర్చలేక పోయారని, అన్యాయంకూడా చేశారని చెప్పవలసి వస్తున్నది.

హీరో, హీరోయిన్, విలన్ ఫ్రేంలో ఒక చరిత్రాత్మక పోరాటాన్ని ఇరికించాలనుకోవడం నేరం. ఆ ఫ్రేంకోసం ఆ పోరాటానికి న్యాయం చేయకపోవడం, వాస్తవాలను విస్మరించడం క్షమించరాని నేరం.

గత చరిత్రను కళారూపంగా మలిచేటప్పుడు ఏ జాగ్రత్తలు తీసుకోవాలో తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చేసిన దుస్సాహసం ఒక గుణపాఠంగా పనికొస్తుంది.

ముద్రణకు సంబంధించి ఎచ్‌బిటి ప్రచురించిన పుస్తకాలన్నింటిలో భయంకరమైన అజాగ్రత్తతో, అర్థాలు మారిపోయే అచ్చుతప్పులతో వచ్చిన పుస్తకమిదే.

— వి. జి.

---

ఉప్పెన - నవల - నరిపల్లి కృష్ణారెడ్డి, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ (మార్చి 1981), పేజీలు : 148 + viii + 2, వెల : రు. 5.00, ప్రతులకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-695, హిమాయత్‌నగర్, హైదరాబాద్, 500 029

చర్చ :

# రచన - భాష

1 ప్ర: మాండలీకంలో వస్తున్న విప్లవ సాహిత్యం మీకు సులభంగా అర్థమవు తున్నదా ?

జ : అర్థమవుతున్నది. అల్లం రాజయ్యగారు మాండలికభాషతో సాహిత్యంలో ప్రవేశించి సంచలనం కలిగించినందువల్ల మీరు ఈ చర్చను ప్రారంభించారు. రావి శాస్త్రివంటి రచయితలు వారివారి మాండలికభాషలకు సంబంధించి ఈపని ఇదివరకే చేసారు. వీరికి భిన్నంగా రాజయ్యగారు తమ కథలను, నవలలను పూర్తిమాండలికంలో రాసారు. అందువల్లనే అనుకుంటాను ఈ సంచలనం. మాండలికభాషలలో తమ రచనలను కొనసాగించిన రావిశాస్త్రివంటివారి రచనలు కూడ, ఆ మాండలికం నాకు సుదూరమయింది అయినప్పటికీ, దాదాపు పూర్తిగానే అర్థమయాయి, ఏదో కొన్ని పదాలు ఇబ్బంది కలిగించడం తప్ప.

2 ప్ర: మాండలీకాన్ని అర్థం చేసుకోవడంలో వున్న ఇబ్బందులేమిటి ?

జ: నాకు దాదాపుగా ఏమీ ఇబ్బందులు లేవు. అయితే ఉండగల ఇబ్బందులు ఇవి కావచ్చు. (ఇలా రాయడం నా జవాబు పరిధిని అతిక్రమిస్తుంది. అయితే ఈ చర్చలో నాకు ఆసక్తి ఉన్నందువల్ల, జవాబు ఇవ్వడంతో మాత్రమే ఊరుకోకుండా, ఆయా విషయాలను చర్చించే ప్రయత్నం అక్కడక్కడ చేస్తున్నాను. మీకు అవసర మనుకుంటే స్వీకరించండి, అధికమనుకుంటే వదిలేయండి.) అన్యప్రాంతాలవారికి మాండలికభాషను చదువడంలో ఇబ్బందివచ్చి, మాండలికం అయినందువల్లనే కొంత నూతనత్వాన్ని సంతరించుకున్న పదం మరింతగా కొత్తదై అర్థంకాకపోవచ్చు. ఎందు కంటే మాండలికపదంలో జీవం చదువడంలో ఉంది. ప్రజలతో, ప్రజల భాషతో సంబంధం లేకపోవడం అర్థంచేసుకోవడానికి పెద్ద అడ్డంకి.

3 ప్ర: ఆ రచనలు అర్థం కాకపోతే అది మాండలీకరచనావైఫల్యమా? పాఠ కుని వైఫల్యమా ?

జ: చాలావరకు పాఠకుని వైఫల్యమే. ఇక్కడ రెండవ ప్రశ్నకు రాసిన జవా బును గమనించండి. రచయిత మాండలికభాషను సరిగా పుణికిపుచ్చుకోలేకపోతే అది రచనాలోపం అవుతుంది. రచయితకు ప్రజలతో సన్నిహితసంబంధం ఉన్నప్పుడు ఇందుకు అవకాశం తక్కువ. అయితే ఒకటి జరగవచ్చు. రచయిత సంకుచిత పరిధిలోనున్న మాండలికభాషను ఉపయోగిస్తే తప్పకుండా ఇబ్బంది కలుగుతుంది. దాన్ని కూడ రచనావైఫల్యమనకూడదు. రచయితకున్న దృక్పథలోపం అవుతుందిఅది.

4 ప్ర: మాండలీకంలో వస్తున్న సాహిత్యం యితర ప్రాంతాలకు వ్యాప్తి చెందుతుందా ?

జ: వస్తువుమీద (పరోక్షంగా రచనావైశిష్ట్యం మీద), పాఠకుని సంసిద్ధతల మీద ఆధారపడి మాండలికభాషా సాహిత్యం ఇతరప్రాంతాలకు వ్యాపిస్తుంది భాష మీద సరియైన దృక్పథం లేనప్పుడు, ఇతర భాషామాండలికాన్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించక అసహనాన్ని పెంపొందించుకున్నప్పుడు వ్యాప్తిచెందడం కష్టం.

5 ప్ర: వ్యాప్తి చెందకపోతే గల కారణాలేమిటి ?

జ: మాండలికభాషను చదవడం కష్టం కావడం, తత్ఫలితంగా, ఇతరవిధాల అర్థంకాకపోవడం వంటి పైన వివరించిన కొన్ని కారణాలు.

6 ప్ర: పాఠకులే ప్రయాసతోనైనా ఆ సాహిత్యాన్ని అవగాహన చేసుకోవాలంటారా ?

అవును.

7 ప్ర: ఎందుచేత ?

జ: ప్రజల సంస్కృతితో సంబంధం కలిగిఉండాలి కనక. సంస్కృతిలో భాష ఒక ముఖ్యమైన అంశమని మరువకూడదు. వారి జీవితం వారి భాషలోనే బాగా వ్యక్తమవుతుంది. కొన్ని భావాలు మాండలికభాషలో తప్ప అభివ్యక్తం చేయడం కష్టం. ప్రజల జీవితాన్ని, ఆ జీవితంతో ముడిపడిపోయిన భాషతో వేరుచేసి తెలుసుకోవాలనుకోవడం గులాబిపువ్వును అద్దంలో చూడాలనుకోవడం వంటిది. అద్దంలో గులాబి కనిపిస్తుందిగాని పరిమళం ఉండదు.

8 ప్ర: విస్తృతప్రచారలక్ష్యంతో మాండలికరచనలను ఏవిధంగా సులభతరం చేయాలంటారు ?

జ: విశాలపరిధిలోనున్న మాండలిక భాషను తీసుకోవాలి. రచయిత తాను చెప్పే విషయాలను మామూలుభాషలో చెప్పాలనడం ఆలోచించదగిన విషయం. కఠినపదాలకు అర్థాలు ఇవ్వడం కొంత ఉపకరిస్తుంది. కాని ఇది ప్రోత్సహించదగిన విషయంకాదని నా అభిప్రాయం.

9 ప్ర: పదాలకు అర్థవివరణలు (Foot notes) యిస్తే అర్థంచేసుకోవడంలోని యిబ్బందిని అధిగమించగలరా ?

జ: మొదటి ప్రశ్నకు నా జవాబును గమనిస్తే దీనికి నేను జవాబు రాయడం అవసరం కాదు. ఇంతకుమించి నేను చెప్పదలుచుకున్నది 8వ ప్రశ్నకు జవాబులో ఉంది.

10 ప్ర: మాండలీకంలోవున్న నవలలూ, కథలూ చదివి వినిపించినపుడు అర్థంచేసుకోవడంలోని క్లిష్టతపోతుందా?

జ: తప్పకుండా: అయితే మంచి చదువరికావాలి. ఎందుకంటే మాండలికభాష నిత్యవ్యవహారభాష, అంటే మాట్లాడేభాష, చదివేభాషకాదు. మాట్లాడేభాషలో ఉచ్చారణకు, ఊనికమే చాలా ప్రాధాన్యం ఉంటుంది. అవి లేకపోతే అసలు అభాషలేదు. ఈ విషయాలు తెలిసి, చక్కగా చదవగలవాడుకావాలి. లేకపోతే ఉన్నదానికంటే ఎక్కువ క్లిష్టతరావచ్చు. ఇక్కడ ఒక ఆసక్తికరమైన విషయం మీకు చెప్పాలను కుంటున్నాను. ఈ భాష విషయంమీద నేను జరిపిన ఇంటర్వ్యూలో ఒక పాఠకుడు మాండలికభాషలోని కథను బిగ్గరగా చదివితే బాగుందని అన్నాడు. పైకి చదవడం లోనే, ఉంటే ఉచ్చారణలో, మాండలిక భాషకు ప్రాణమున్నదనడానికి ఇది నిదర్శనం. మరొక పాఠకుడు మామూలు భాషలో ఉన్నకథను చదివినప్పుడు ఒక కథను చదివినట్లుగాను, మాండలికభాషలో ఉన్నకథను చదివినప్పుడు ఒక నాటకం చూసినట్లుగా ఉందని అన్నాడు. కథకంటె నాటకం పాత్రలను పాఠకునిముందు సజీవంగా నిలుపుతుంది. ఈ సజీవత్వం మాండలికభాష తెస్తుందంటే అది దాని విశిష్టతను తెలియజేస్తుంది.

11 ప్ర: మాండలికంలోవున్న పాటతో మమేకం అయినట్లుగా కథ, నవలల్లో లీనం అవుతున్నారా? కాకపోతే ఎందువల్ల?

జ: ఈ రెంటిని నేను సమానంగా అనుభవించగలను. అయితే ఈ సమానత్వంలో తేడాఉంది పాటలో సంగీతంఉంది. కథలో నవలలో లేదు. కథలో, నవలలో సాపేక్షంగా విపులమైన జీవితచిత్రణ ఉంది. పాటలో లేదు. ఆ తేడాలో ఈ అంశాలు ఉన్నాయి. ఈ తేడాకు మాండలికభాషకు సంబంధంలేదనే నా అభిప్రాయం. మాండలికభాషలోఉన్న కథను, నవలను ఆనందించలేక, పాటను ఆనందించగలిగేవారి విషయంలో సంగీతం పనిచేసిందని అర్థం.

12 ప్ర: ఒక మాండలికంలో వచ్చిన రచనను ఇతర మాండలీకాల్లోకి అనువదిస్తే ఎలావుంటుంది?

జ: ఎలాఉండడం మాట అలా ఉంచితే, ముందుగా ఆ అనువదించడం అనవసరం. మాండలికభాషకు, ప్రజల జీవితానికి మధ్యనున్న సంబంధం ఆలోచించాలి. అప్పుడు అనువదిస్తే ఈ రెండింటి మధ్య సంబంధం తెగిపోతుంది. వాడినపువ్వుకు పెంటురాసినట్లవుతుందేమో?

13 ప్ర: మాండలీకంలో సినిమాతీస్తే, నాటకంరాస్తే ఎలావుంటుంది?

జ: చాలా బాగుంటుంది. మాండలికభాషలో తీసిన సినిమా వ్యాపారమార్కెట్టులో నిలువలేకపోతే అది వేరే సంగతి. మాండలికభాషలో సినిమా తీయడమన్నా, నాటకం రాయడం, అంటే ప్రదర్శించడమన్నా ప్రజల జీవితం, భాషలకు అభినయాన్ని, పరిసరాలను కలుపడమన్నమాట. అప్పుడు అవి బాగుండక పోవడమేమిటి? కథనో నవలనో ఒకరు పనికల్పించుకుని చదవాలిగాని, సినిమాలోగాని, నాటకంలోగాని ఆ భాషను పాత్రలు మాట్లాడతాయి. అంటే మాండలికభాషలోనున్న ప్రాణాన్ని ఆ పాత్రలు ఉచ్చరించి చూపుతాయి అని అర్థం మనకు కావలసింది అదేకదా!

— గంగాధర్

---

1 ప్ర. మాండలికంలో వస్తున్న విప్లవసాహిత్యం మీకు సులభంగా అర్థమవుతున్నదా?

జ అర్థంకావడంలేదు.

2 ప్ర. మాండలీకాన్ని అర్థంచేసుకోవడంలోవున్న యిబ్బందులేమిటి?

జ: వాడేపదాలు పరిచయం లేకపోవడం.

3 ప్ర: ఆ రచనలు అర్థంకాకపోతే అది మాండలీక రచనా వైఫల్యమా? పాఠకుని వైఫల్యమా?

జ: మాండలీక రచనా వైఫల్యమే.

4 ప్ర: మాండలీకంలో వస్తున్న సాహిత్యం యితర ప్రాంతాలకు వ్యాప్తి చెందుతుందా?

జ: అంతగా వ్యాప్తిచెందడంలేదు. ఆదరణ తక్కువే.

5 ప్ర: వ్యాప్తిచెందకపోతే గలకారణాలేమిటి?

జ: భాష త్వరగా అర్థంకాకపోవడం.

6 ప్ర: పాఠకులే ప్రయాసతోనైనా ఆ సాహిత్యాన్ని అవగాహన చేసుకోవాలంటారా?

జ: లేదు.

7 ప్ర: ఎందుచేత?

జ: అసలెందుకో మాండలీకమంటేనే విముఖత చూపుతున్నారు. త్వరగా అర్థమయి చావడంలేదురా అంటున్నారు. కాబట్టి పాఠకులింకా ఆ స్థాయికి ఎదగలేదను

కుంటున్నాను. ఆ ఓపికకూడా వాళ్ళలో కనిపించడంలేదు- Regularగా మన సాహిత్యం చదివే మనవాళ్ళే- 'కొలిమంటుకున్నది' పూర్తిగా చదివారా అనడిగితే లేదన్నారు. కారణం చాలా time తీసుకుంటుంది. అర్థంకాదుత్వరగా- అంటారు.

8 ప్ర: విస్తృత ప్రచారలక్ష్యంతో మాండలిక రచనలను ఏవిధంగా సులభ తరం చేయాలంటారు?

జ: రచనలు అందరికీ, అన్ని ప్రాంతాలవారికి అర్థమయ్యేట్టుగా రాయడమే.

9 ప్ర: పదాలకు అర్థవివరణలు (Foot Notes) యిస్తే అర్థంచేసుకోవడం లోని యిబ్బందిని అధిగమించగలరా?

జ: అంతటితో పోయేఇబ్బందికాదది.

10 ప్ర: మాండలీకంలోవున్న నవలలూ కథలూ చదివి వినిపించినపుడు అర్థంచేసుకోవడంలోని క్లిష్టతపోతుందా?

జ: కేవలం వినిపించడంవల్ల లాభంలేదు. మళ్ళీ మామూలుభాషలో వివ రించాలి.

11 ప్ర: మాండలీకంలోవున్న పాటలో మమేకం అయినట్లుగా కథ-నవల్లో లీనం అవుతున్నారా? కాకపోతే ఎందువల్ల?

జ: లీనంకావడంలేదు- కారణం పాటకాబట్టి - మొదటకాస్త ఏమైనా అర్థం కాకపోయినా పాడుతుంటే వినటంవల్ల ఇంపుగావుంటుంది. తెల్సుకోవాలనే ఉత్సుకత ఉంటుంది.

ఉదా॥ వొత్తున్నాడొత్తున్నాడు - ఆ భూములున్న బుగతాడు

పోలీసులతోడు - తోడు- రెండవది పాటలనేసరికి పదాలు కొద్దిగాఉండి పరిచయమైన పదాలు పడడం.

ఉదా॥ పీడేనమ్మో - డబ్బున్నబాడుకావు

దయలేని బాడుకావు.

అందుకే పాటకు కథ - నవలకు మాండలీకంతో పోల్చరాదు. దాన్నిబట్టి అంచనా వేయలేం.

12 ప్ర: ఒక మాండలీకంలో వచ్చిన రచనను ఇతర మాండలీకాల్లోకి అనువ దిస్తే ఎలా వుంటుంది-

జ: బాగానేఉంటుంది. ఏప్రాంతంవాడు- ఆప్రాంతమే- ఒకడిగురించి ఒకడు అర్థంచేసుకోవడం ఇబ్బంది- అయినా అంత రెండింతలశ్రమ- అంతటైము waste చేసినవాళ్ళం.

13 ప్రః మాండలీకంలో - సినిమాతీస్తే - నాటకంరాస్తే ఎలావుంటుంది.

జః ఇంతకుముందే చిల్లరదేవుళ్ళుతీసి చాలానష్టపోయారు. అది లక్షలతో కూడుకొన్నది. అన్నిప్రాంతాలవారికి అర్థంకాకపోవడమే fail కు కారణం. "చిల్లర దేవుళ్ళు" సినిమా మాండలీకం- తెలంగాణ యాసభాషకాబట్టి- మిగతా ప్రాంతాల వాళ్ళను ఆకట్టుకోలేక పోయింది. లక్షలపెట్టుబడితో కూడుకున్నది - మనంతీసే సినిమా problem నుexpert చేయడమే. అలాంటి పరిస్థితుల్లో కేవలం ఒకప్రాంతం వాళ్ళనుమాత్రమే దృష్టిలోపెట్టుకుంటే లాభంలేదు. ఏమూలలోఉన్నా ఈ వ్యవస్థలో ప్రజల ఇబ్బందులు ఒక్కటే. అందుకే సినిమామాత్రం మాండలీకంలో తీయడం చాలా పొరబాటు-

రెండవది మొన్ననే Release అయి డబ్బాలుకూడా తిరిగొచ్చాయి- అందులో రాజమండ్రి భాషపెట్టడంజరిగింది- అది తెలంగాణావాళ్ళకు పట్టలేదు- అది తూర్పు వెళ్ళేరైలు

అందుకే ఇహ- మాండలీకంలో మాత్రం తీయకూడదని మొన్ననే కూర్చొని నిర్ణయించుకోవడం జరిగింది.

ఇహ.... నాటకంఅంటావా? అదిఅంతే- అదేకాదు మాండలీకంలో ఏదిచేసినా, రాసినా అది ఆ ప్రాంతంవరకుమాత్రమే ఉంటుంది.

అందుకే రచనలు- మాండలీకాన్ని వదలిపెట్టాలి, అన్ని ప్రాంతాలవాళ్ళకు అర్థమయ్యేరీతిలో రచయితలు రచనలుచెయ్యాలి.

చెరబండరాజు, గద్దర్‌లు తెలంగాణవాళ్ళయినా వాళ్ళ రచనలు అన్నిప్రాంతాల వారికి అర్థమవుతున్నవి. కారణం వాళ్ళు జనరల్‌చేసి, అందరికి అర్థమయ్యేరీతిలో రాయడమే.

'వంగపండు' రచనలు తెలంగాణవాళ్ళకింకా అంతగా పట్టకపోవడం మాండ లీకం చోటుచేసుకోవడమే. అయినా పాడుకుంటున్నారంటే- పాటకాబట్టి, శృతి, లయ, సంగీతాలు మిళితంకావడంతో, వినటానికి ఇంపుగా ఉంటుందికాబట్టి మొదట అర్థం కాకపోయినా తర్వాతనయినా మరోసారి వినైనా ఉత్సాహంతో అర్థంచేసుకుంటున్నారు.

— ఉదయకుమార్

SRJANA Telugu Monthly Dec. 81 H/WL-10
Regd. No. with Registrar of Newspapers 10953/67.

# సృజన దగ్గర కొత్త పుస్తకాలు

## విరసం ప్రచురణలు

1. తుడుం - ఇంద్రవెల్లిపై కవితా సంకలనం 1.25
2. కళలు, సారస్వతం ఎవరి కోసం? మావో యేనాన్ ప్రసంగం 1.00
3. సాహిత్యం కుట్రకాదు, రచయితలు కుట్రదారులు కారు త్రిపురనేని మధుసూదనరావు కోర్టు ప్రకటన. 1.00
4 లూసున్ సాహిత్య జీవితం 1.50

## యువ ప్రచురణ

5. రిహార్సల్ - ఎస్. కె. కవితా సంపుటి 2.00

## ఇతర ప్రచురణలు

6. రోడ్డుమీద సూర్యుడు - రాంమోహన్‌రాజు కవితా సంపుటి 3.00
7. ఎర్రగాలి - జైరామ్ కవితా సంపుటి 5.00